

బలము మరియు శక్తి కోసం!
పాలు
కోకో
మాల్టు
పంచదార
Cadbury's
Bournvita
THE IDEAL FOOD DRINK FOR STRENGTH AND VIGOUR
బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది.
కండరములు మరియు టిష్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు,
బలము మరియు శక్తి కోసం కార్బొహైడ్రేట్‌లు, ఎముకలను
దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు
అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా
తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును!
క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా
BENSONS/I-CF-23

అన్నపూర్ణావారి



# ఆత్మగౌరవం

నిర్మాత
డి.మధుసూదనరావు

దర్శకుడు
కె.విశ్వనాథ్

ప్రేమించి పెళ్లి చేసుకో
నీ మనసంత హాయి నింపుకో

సంగీతం రాజేశ్వరరావు
ఫోటోగ్రఫీ సెల్వరాజ్
నవయుగ విడుదల

# ఇంతకంటె మంచి సాధనంలేదు!

ఆనంద జనకం. మనస్ఫూర్తియైన ప్రేమభరితం. మరియు అత్యుత్తమ సాధనము — చాలాకాలం నిలవుండే సింథాల్ సాధనము. జి-11* తో గూడిన సువాసనగల సింథాల్, శిశువు యొక్క చర్మము మీద సహితం పెరుగుచుండే క్రిములకు విధ్వంసకరం. అంతేగాక, ఇంకా ఎంతో అద్భుతంగా సౌమ్యమైనది. అది శుభ్రపరచుచూ రక్షణ నిచ్చును.

సింథాల్ సబ్బుతో స్నానానంతరం, సింథాల్ టాయిలెట్ పౌడర్ చల్లుట సంపూర్ణమైన ఉత్తమ సింథాల్ సాధనము

* ఎల్.ఫి.ఎస్.ఎ. జివోడా యొక్క ట్రేడ్ మార్కు.




సబ్బులందును, కొన్ని టాయిలెట్రీస్‌లోను ఉపయోగించే నిమిత్తం ఏళ్లతరబడి లేబొరేటరి పరిశోధన మూలకంగా సాధించిన సంపూర్ణ దుర్గంధ-నిర్మూలక పదార్థమును మీరున్నూ మీ బిడ్డ కోసం ఉపయోగించుకోండి. పూర్తియైన వైజ్ఞానిక వివరముల నిమిత్తం "జి-11. ఏమిటి?" అనే ఉచిత సచిత్ర చిన్న పుస్తకము కోసం గోద్రెజ్, బొంబాయి-12, కు వ్రాయండి.




CT. 22-TEL.

సింథాల్ అన్నిటికంటె మంచిది!

### ముఖచిత్రం

ఎస్. వి. రంగారావు ముఖచిత్రం చాలా నిండుగా ఆకర్షణీయంగా ఉన్నది.

ఆర్. విజయలక్ష్మి (ఖమ్మం)

*   *   *

4—2—66 మీ వారపత్రిక ముఖ పేజీ మీద వేసిన బొమ్మ ఏమీ బాగుండలేదు. మీలాంటి గౌరవ మయిన పత్రిక అట్టమీద అలాటి బొమ్మలు ఇంక వేయరని ఆశిస్తున్నాను.

ఎల్. వెదరంమారావు (మల్లవరం)

### వైజ్ఞానిక వ్యాసాలు

25—2—66 సంచికలో డాక్టర్ మహీధర్ నళినీమోహన్‌గారు లూనా—9 ని గురించి వ్రాసిన "చంద్రునికో నూలుపోగు" అన్న వ్యాసం చాలా బాగుంది. ఈ వ్యాసానికి సూచించిన పటములో శాంతిసముద్రము, మేఘాల సముద్రాలను మాత్రమే మాత్రమే సూపించారు. లూనా—9 దిగిన తుఫానుల సముద్రాన్ని చూపించలేదు. లూనా—9 పి మాపించిన స్థలమే తుఫానుల సముద్ర మను కుంటాను.

డి. శ్రీనివాసబాబు (హైదరాబాద్)

*   *   *

"చంద్రుడికో నూలుపోగు" వ్యాసం ద్వారా డాక్టరు మహీధర్ నళినీమోహన్, చంద్రునియొక్క వివరాలు సూక్ష్మంగా అర్థమయ్యేటట్లు వివరించారు.

"కరుణ" సీరియల్ రానురాను పరాకాష్ఠ చేరుతూంది. రచయిత కొండముది శ్రీరామచంద్రమూర్తిగారి కలం నుండి ఇంత చక్కని నవల వెలువడినందుకు, ఆయన అభినందనీయులు.

ఎం. ఆర్. వి. రావు (వెల్లూరు)

*   *   *

ఆంధ్రపత్రిక (10—9—65) లో ప్రచురింపబడిన వైజ్ఞానిక గాథాశతి—35లో డాక్టరుగారు వ్రాసిన వ్యాసమున్ను, దానిపై శ్రీ కోనేటిరావుగారి విమర్శను, (28—1—66) అద్దానిపై డాక్టరుగారి జవాబులను 28—1—66 పత్రికలో చదివిన తర్వాత—వయస్సులోను, అనుభవములోను నేను వారికి సాటి కానప్పటికీ సాహసించి, నాకు జెనెటిక్సు శాస్త్రమందున్న పరిమితజ్ఞానముతో, నాకు కలిగిన అభిప్రాయములను వ్రాయుచున్నాను. ఈ నా అభిప్రాయములను పాఠకులు, ముఖ్యంగా జెనెటిక్సులో ప్రవేశమున్నవారు, శ్రీయుతులు డాక్టరుగారు, శ్రీ కోనేటిరావుగారు కూడా సహృదయులతో స్వీకరిస్తారని ఆశిస్తున్నాను.

"ఈ విష్పత్తి కనుక్కోడానికి చిన్నప్పు మెండెలుకు ఏడేండ్లు పట్టినా, ప్రపంచము ఈ రహస్యాన్ని గుర్తించడానికి 35 సం. లు పట్టినా, మెండెలుగారి జీవితకాలములో ప్రచురితము

# ఉత్తరాలు

శ్రేణిలో నిలచినా, నేటికి 65 సం. లయి ఆ సూత్రములు జగద్విదితమయినప్పటికీ..." నేడు శ్రీ కోనేటిరావుగారు, డాక్టరుగారు తమ అభిప్రాయ భేదములతో సామాన్యుల యందు వారే అభిప్రాయమునకు గురి అవ్వ దురో కూడా మరచినట్లుంది.

దీనికంతటకు కారణములయిన ఈదిగువ నుదహరించిన లోపములు (నేను భావించి నట్లు) లేనట్లయితే డాక్టరుగారివ్యాసము చాలా బాగుండేది. ఎంతటి సామాన్య ప్రజానీకమయినా గ్రహించుటకు, డాక్టరుగారి ఉద్దేశానుసారం, అందుబాటులో కూడా ఉండేది......

అ. డాక్టరుగారు సామాన్యులకని వ్రాసిన మొదటి సూత్రం ప్రకారం, మెండెలు మొదటి సూత్రమే ఖూనీ అయిపోయింది. "స్వచ్ఛ గుణమున్న రెండు వేరు రకాల మొక్కల్నిగాని......" అని వారు మొదటే వ్రాయవలసినది. కాని స్వచ్ఛ గుణము విషయమై 28—1—66 పత్రికలోని జవాబులలో ప్రస్తావించేరు. అదేమంత కఠినమైన పదజాలము కాదుకూడా.

ఆ. సామాన్యుల కందుబాటులో ఉండుటకు వారు వ్యాసం వ్రాసేరు. కనుక.... రెండవ సూత్రములో వారుదహరించిన ఉదాహరణలకు బదులు మెండెలు బఠాణీ మొక్కలతో పరిశోధించిన ఏడు గుణములలో ఏ ఒక్కదానినైనా 'వివరాల'తో కూడా వివరించుటే, సామాన్యులకు ఇంకా సులభంగా అర్థమయి ఉండెడిది. అర్థమవుతుంది కూడా.

"పువ్వులలోనేకాదు. ఏ ప్రాణులలో నైనా ఈ నిష్పత్తిలోనే మిశ్రమ జాతి పెరుగుతుంది" అని వారు సూత్రీకరించకుండా ఉంటే బాగుండేది.

ఈ. శ్రీ కోనేటిరావుగారు 20 సం. నుంచి జంతు శాస్త్రం బోధిస్తున్నా వృత్తి రీత్యాగాని, కుతూహలంతోగాని తమ సందేహ నివృత్తికోసమైన కనీసం "ప్రిన్సి పల్స్ ఆఫ్ జెనెటిక్సు" అని సిన్నట్టు, డన్ను, డబ్ జాన్‌స్కీలు ముగ్గురు కలిసి వ్రాసిన పుస్తకంలో 421 వ పుటలో మొదటి కాలంలో 13 వ పంక్తిలోనైన చూచిన యెడల తమ సందేహము తీరగలదు. అట్లుగాక దానిపై డాక్టరుగారే తిరిగి వారికి సమాధాన మిచ్చుట చూచి సాటి అధ్యాపకులమైన మేము చాలా విచారించదగ్గ విషయము.

నరిపల్లి భాస్కరరావు (కర్లికోట)

### వ్యాసాలు

ఉత్తర వియత్నాంను గురించి శ్రీ వి. ఎస్. ఆర్. బ్రహ్మంగారు కళ్లకు కట్టినట్లుగ వ్రాశారు. ఆ వ్యాసం చదువుతోఉంటే, అప్పటి ప్రజలపై అన్యాయమైన సానుభూతి, ఒకవేళ మన దేశంలోనూ కమ్యూనిస్టులు ప్రభుత్వానికివస్తే అలాగే ఉంటుందా అని సందేహం గల్గుతున్నది. అప్పటి (వియత్నాం) ప్రజలకు శ్రీ బ్రహ్మంగారు కోరినట్లుగాని భగవంతుడు మనశ్శాంతి, స్వేచ్ఛావందానే ప్రసాదించాలని ప్రార్థించెదను.

పి. వి. పతి (గోపాల్)

### కథలు

కుసుమ (కథ) నా కెంతో నచ్చింది. కుసుమమీద నమ్మకంలేని నాకు ఈ కథ చదువుతుంటే—నామ్మగారు మేడమీదనుండి పడినప్పుడు నవ్వు, నత్యం చనిపోయినప్పుడు బాధ కలిగాయి. ఇంతటి ఉద్రిక్తతను కలిగించిన కథ వ్రాసిన రచయితకు నా అభినందనలు తెలుపుచున్నాను.

టి. ఎస్. ఎన్. మూర్తి (రాజమండ్రి)

*   *   *

'బ్రహ్మముడి' కథ చదివాను. చాలా నచ్చి స్మృతోనడిచింది. చాలాబాగుందిక్కే. ఒక చిన్నసందేహం. పెళ్ళారి లేచిన దగ్గర్నుండి 'అసత్య మాడరాదు' అని సాక్షి పలికే మాస్టారే అసత్య మాడిందని! అయినా వెయ్యి అబద్ధాలాడైనా ఒక పెళ్లి చెయ్యమన్నారు పెద్దలు. అందులోకి అది మాష్టారి పెళ్లి. అబద్ధమాడినా తప్పులేదనిపించింది.

నిత్యశ్రీ (అనకాపల్లి)

*   *   *

25—2—66 వార పత్రికలో జి. కృష్ణమూర్తిగారు (సికిందరాబాదు నుండి) "మూసిన కిటికీ" కథను గురించి వ్రాసిన లేఖ చదివాను. తెలుగు సారస్వత దౌర్భాగ్యము మరియొకసారి మీ పత్రిక తేటతెల్లముగా బయిటపు చేసినది. కలువకు చంద్రునకు కల ప్రకృతిసిద్ధమైన సహజబాంధవ్యమును గుర్తించలేక (అజ్ఞానముచేత) ఏదియో ఒక లేఖ వ్రాసినంతమాత్ర తముచేత అందలి ఔచిత్యమును గుర్తించలేక, తెలుగు సారస్వత పరిరక్షణకు కంకణము కట్టుకొనిన పత్రికలో ప్రచురించుట అత్యంత హేయముగనూ, జుగుప్సాకరముగను ఉన్నది. ఇకముందైనను సారస్వత శ్రేయస్సుకొరకైనను సంపాదకులు కథ పరించి ఇట్టి లేఖలు ప్రచురించి హాస్యాస్పదులు కాకుండదురుగాకలని ఆశించుచున్నాను.

ఆ. భాను (విజయవాడ)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 25—3—66

పరాభవనామ సం॥ చైత్రమాసం శుద్ధ॥ తదియ

సంపుటము : 58 సంచిక : 30

స్థాపితము :
1908

*

ప్రధాన సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

క్రొత్తరేట్లు ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుతోసహా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |

## మనలో మాట

పాఠకులందరికీ ఉగాది శుభాకాంక్షలు !

* * *

1965 చిత్రాలకి సంబంధించిన బాలట్ ఫలితాలు ఈ సంచిక మధ్య పేజీలలో ప్రచురించాము. 'ఎన్నిక' అయిన వ్యక్తుల విషయంలో 1964 కీ ఈ సంవత్సరానికీ మూడే మార్పులు— సంగీత దర్శకుడు, సహాయ నటి, నటుడు. సినిమా అభిమానులందరూ ఈ ఫలితాలని తమకి తోచిన విధాలుగా వ్యాఖ్యానించక మానరు!

సాధారణంగా 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో నాటకం వెయ్యము. ఉగాది ప్రత్యేక సంచిక కాబట్టి 'నిబంధనని' కొద్దిగా సడలించాము...

* * *

ప్రముఖ నటుడు శ్రీ ఎన్. టి. రామారావుగారి వ్యాసం ఒకటి ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.... సినిమా నటి కుమారి వాసంతి వ్యాసం ఒకటి కూడా ప్రచురిస్తున్నాము....

* * *

ఈ వారం 'నిరీక్షణ' అనే కొత్త సీరియల్ ప్రారంభం అవుతుంది. రచయిత్రి శ్రీమతి ఉప్పల విజయలక్ష్మి ప్రస్తుతం హైదరాబాదులో ఉంటున్నారు... 'వనితాలోకం'లో 'పి. ఎస్.' రాసిన 'చెల్లాయికి ప్రేమతో' అనే శీర్షిక ప్రారంభిస్తున్నాము...

* * *

గమనిక— 'మలుపు తిరిగింది' కథ (34 పేజీ) రాసిన వారు శ్రీ కొలకలూరి ఇనాక్. పొరపాటువల్ల అక్కడ పేర్కొనటం జరగలేదు.

* * *

పోయినవారం వేసిన 'రజ్జు సర్పభ్రాంతి' రచయిత డాక్టర్ నళినీమోహన్, నసీరుద్దీన్ కథల రచయిత ఒకరేనని పాఠకులు గ్రహించే ఉంటారు. అమెరికా, బ్రిటన్లకి సంబంధించిన కథలు వేశాము కాని ఆధునిక రష్యా వాతావరణానికి సంబంధించిన కథ వెయ్యటం ఇదే మొదటిసారి...

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

సం॥

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'ఉగాది'
చిత్రకారుడు : పాంబు.

# ప్రపంచ దేశాలలో ఉగాది!



వేపపువ్వు!

(ఫొటోలు: ఎస్. రామకృష్ణ)

గుండ్రటి బల్లముందు కూర్చున్నవారిలో ఎవరు మొదటివారు, ఎవరు కడపటివారు అని చెప్పడానికి సాధ్యంకానట్టు, కాలచక్రం లోను ఏకాలంముందు, ఏ కాలం తర్వాత అని చెప్పడం కష్టం. అందువల్లనే సంవత్సరారంభంకూడా ఆయా ప్రదేశ పరిస్థితులను బట్టి, మత రాజకీయ పరిణామాలనుబట్టి మారుతూ వచ్చింది.

వ్యవసాయం ప్రధానంగా ఉన్న ప్రదేశాలలో పంటలకాలం సంవత్సరారంభం. పంటల లోను మూడు నెలల పంటలు మొదలు తొమ్మిది నెలల పంటలూ ఉన్నాయి. ఒకప్పుడు హేమంతం, మరొకప్పుడు శిశిరం, ఇంకొకప్పుడు వసంతం, వేరొకప్పుడు వర్షాగమం, తర్వాత శరత్తు సంవత్సరారంభ కాలమూ, వాటిలో తొలి నెలవంకనాడు సంవత్సరారంభదినమూ అయాయి.

ఈ వైవిధ్యం మన దేశంలోనే కాదు. వ్యవసాయం ప్రధానంగాను, సంచారజాతులు ఎక్కువగావున్న అన్ని దేశాలలోనుపూర్వం మంచి వుంది.

క్రీస్తుపూర్వం మొదటి శతాబ్దంలో రోమన్ చక్రవర్తి అయిన జూలియస్‌సీజర్ జనవరిని మొదటినెలగా నిర్ణయించాడు. అప్పుడు శనిసామ్రాజ్యవైభవం సూచించే శాటర్నలియా అనేఉత్సవాలు మకరమాసంలో జరిగేవి. జనవరినెలను మొదటినెలగా పరిగణించడంతో ఆ సంవత్సరాది ఉత్సవాలు, శాటర్నలియా ఉత్సవాలూ కలిసి జనవరి నెలంతా వినోదమయంగా ఉండేది. బూతు పాటలు, మాటలు, చేతలు కూడ తక్కువగా ఉండేవికావు. క్రైస్తవమతం వ్యాపించిన తర్వాత క్రీస్తు నిర్యాణంకారణం గాను, క్రైస్తవాచార్యుల నిష్ఠ కారణంగాను బూతు ఉత్సవాలేకాక ఎక్కువనాళ్లు జరిగే వినోదాలు కూడా మాయమయాయి. జూలియస్‌సీజర్ సంస్కరించినప్పటికీ యూరోప్‌లో సంవత్సరాది కొన్ని దేశాలలో మార్చి లోను, కొన్ని దేశాలలో క్రిస్మస్‌లోను, జూన్ నెలలోను జరిపేవారు. 16వ శతాబ్ది తర్వాత యూరోప్‌ఖండమంతటా జనవరి 1వ తేదీ సంవత్సరాదిగా ఆచారం స్థిరపడింది. స్కాట్‌లెండ్‌లో 1600లోను, ఇంగ్లండులో 1752లోను ఈ ఆచారం ఆచరణలోకి వచ్చింది.

మన పొరుగునవున్న చైనావారు మనలాగే చాంద్రమానం అనుసరించేవారే. వారికి 12 నెలలు పన్నెండు చంద్రులు. ఒక్కొక్క చంద్రునికి—నెలకు—ఒక్కొక్క పేరుంది. పక్షాలకు, గంటలకు కూడా వేరే వేరే పేర్లున్నాయి. వసంత ఋతువు మొదటి నెలతో ప్రారంభమవుతుంది. ఈ వసంత ప్రారంభాన్ని 'లీచున్' అంటారు. మొదటినెల 7వ తేదీ మొదలు 10వ తేదీవరకు వస్తుంది. వసంతోత్సవం మూడవనెల ప్రారంభంలో జరుపుతారు. ఇది చలికాలం గడచినతర్వాత 108రోజులకు వస్తుంది. దీనిని 'ఛింగ్ మింగ్' అంటారు. అంటే మార్చి ప్రారంభంలో సంవత్సరాది. చాంద్రమానం గనుక కొత్త నెలవంక—శుద్ధ పాడ్యమి—తో నవవర్షారంభం. మనం అధికమాసం చేర్చుకుని భూ పరిభ్రమణ కాలాన్ని సర్దుకుంటున్నట్టే చైనావారూ అధికమాసాలతో సర్దుకుంటుంటారు.

జపాన్‌లో నూతన సంవత్సరాది జనవరి 4వ తేదీనుంచి ప్రారంభమవుతుంది. 3వ తేదీ రాత్రి మంచి కలగన్నవారు అదృష్టవంతులుగా పరిగణించబడుతారు. 'ఫ్యూజీ' పర్వతాన్ని కలలోచూచిన వారు ఆ సంవత్సరమంతా భాగ్యశాలులుగా ఉంటారని నమ్మకం. జపాన్‌వారిలో సంవత్సరాదికి చాలా ప్రాధాన్యం వుంది. నిరుపేదలు గూడ పిండివంటలు చేసుకోడం, కొత్త బట్టలు కట్టుకోడం, దేవాలయాలకు చైత్యాలకు వెళ్లడం, వినోదించడం నెలంతా జరుగుతాయి. సంవత్సరాది నాడు అప్పాలు చేసి సూర్యచంద్రులకు నివే

దిస్తారు.సూర్యునికి నివేదించిన దానిని పురుష అపూపమని, చంద్రునికి నివేదించిన దానిని స్త్రీ అపూపమని అంటారు.

లంకలోని వెడ్డాజాతివారు సంవత్సరాది నాడు కొత్త బియ్యంతో రొట్టెలుతట్టి, అట్లుపోసి ఇష్ట దేవతలకు నివేదిస్తారు

అమెరికాలో వివిధ దేశాలలోని అనాది జాతులలో సంవత్సరాది వివిధవిధాలుగా వుంది. మెక్సికోలో పూర్వం ఫిబ్రవరి 2 వ తేదీన నూతన సంవత్సరారంభం. అజ్టెక్ అనే ఆదిమజాతి సంవత్సరాదీ ఫిబ్రవరి నెలలోనే. ఉత్తర అమెరికాలోని రెడ్ ఇండియనులు, ఇరాక్వోస్ తెగవారు ఫిబ్రవరిలోను, ఎస్కిమోలు, కాలిఫోర్నియాలోని తెగలు జూలైలోను, హోపీ అనే తెగ నవంబరులోను సంవత్సరాది జరుపుకుంటారు. ప్లిబోలు అనబడే తెగవారు శిశిరఋతువులో సంవత్సరాది చేసుకుంటారు.

నేడు ఎన్నో కారణాలతో వివిధ దేశాలు సన్నిహిత మవుతుండడంవల్ల, పాశ్చాత్య



అతిథులకు ఆహ్వానం

సంస్కృతివల్ల అన్ని దేశాలవారు తమ తమ ఆచార సంవత్సరాదితోపాటు క్రైస్తవ సంవత్సరాదిని, లావాదేవీలకు మరొక సంవత్సరాదిని జరుపుకుంటున్నారు.

సంవత్సరాది ఎన్ని రకాలుగా మారినా, గత వర్షానికి, జీవితపు గతానుభవాలకు వీడ్కోలిచ్చి, నవ వర్షానికి, నవానుభవాలకు స్వాగతమిచ్చే అపూర్వదినం.

—టి. ఆర్. ●

# అరవ దేశంలో తెలుగు ఉగాది

23 మార్చి తెలుగువారికి పండుగ దినం. కొత్త సంవత్సరం మొదలయ్యే దినం: ఎక్కడున్నాసరే వారు ఉగాది పండగ చేసుకుంటారు. చైత్రమాసం ఈ రోజుతో ప్రారంభమవుతుంది.

పురోహితుడు పంచాంగం చూసి పండగరోజు ఏదో చెప్పగానే ఇంటిల్లిపాదీ మంగళస్నానం ముగించి కొత్త బట్టలు వేసుకుంటారు. సరిగ్గా సుముహూర్తానికి పురోహితుడువచ్చి కొత్త పంచాగాన్ని వెండిపళ్లెంలోపెట్టి కులదైవంముందు ఉంచుతాడు ఆతర్వాత పూజ జరుగుతుంది. పసుపు, కుంకుమ చందనం, పుష్పమాలలు పూజాద్రవ్యాల పూజ ముగియగానే పంచాంగశ్రవణం చేస్తాడు పూజారి ...

ఆపైన ఇంట్లోవారంతా బంతిలో కూర్చోగా ఇంట్లోకెల్లా పెద్దావిడ అందరికీ వేపపువ్వు, చింతపండు, బెల్లం—వీటితో తయారు చేసిన పానీయం ఇస్తారు. ఈ పానీయం పులుపు, చేదు, తీపి రుచులకిచిహ్నం. ఈ 'రసం' ఇస్తూ ఉండగానే పురోహి



పంచాంగపఠనం

తుడు కొన్ని మంత్రాలు చదువుతాడు. పానీయంలోని వివిధ రుచులనిచ్చే ద్రవ్యాలు అవి పుచ్చుకునేవారి దేహాలకీ, ఆత్మలకీ తగిన రక్షణ ఇస్తాయి అని ఈ మంత్రాల అర్థం.

జీవితంలోని అనుభవాలు తియ్యగా చేదుగా కూడా ఉంటాయి కదా!

పంచభక్ష్య పరమాన్నాలతోతయారుచేసే భోజనమేకాక పిల్లలకి మరొక ఆనంద కారణం కూడా ఉంటుంది. ఉగాదినాడు వాళ్లని దండించకూడదుట!

సాయంత్రం ఆడవారు చుట్టుపక్కల వారిని ఇళ్లకి పిలుస్తారు. మిఠాయి, తాంబూలాలు, టెంకాయలు ఇస్తారు.

ఎక్కడఉన్నా ఉగాది తెలుగువారికి ఆనందమయ దినం.

—ఎస్. రామకృష్ణ ●

శ్రీకృష్ణ

# ఆహార విధానమూ: యాచనలూ

ఆహారమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం అతిగా వ్యవహరించారనే విషయం పార్లమెంటు చర్చల్లో విదితమవుతున్నది. అమెరికా అధ్యక్షుడు శ్రీ జాన్సన్ సలహాపై ఆహారమంత్రి ప్రారంభించిన ఖండాంతర యాచనపై ఆయన తీవ్ర విమర్శలకు గురి అవుతున్నారు. ప్రధాని తర్వాత అంతటిస్థానాన్ని పొందటానికి శ్రీ సుబ్రహ్మణ్యం చేసిన ప్రయత్నాలు కాబినెట్‌లోని ఆయన సహచరుల నుంచి ఆయన్ను దూరం చేశాయి. మే, జూన్, జూలై నెలల్లో శీతాకాలం పంటలు మార్కెట్‌లోకి వస్తాయి గనుక ఆమూడు నెలలూ అనుకూలమైనవికావని శ్రీ సుబ్రహ్మణ్యం చెప్పిన దానిపై స్పీకర్ కూడా ప్రశ్నించటం జరిగింది. ముఖ్యంగా ఉత్తరాదిన శీతాకాలంలో పంటకొచ్చేది గోధుమనీ, తాను వరిపంట సంగతి ప్రస్తావించావనీ ఆయన వివరించటానికి ప్రయత్నించారు.

భారతదేశంలో వ్యవసాయం స్తంభించిపోయిందని అమెరికా ప్రభుత్వం ఆందోళన చెందుతున్నదని శ్రీ సుబ్రహ్మణ్యం పార్లమెంటులో చెప్పారు. కొన్ని సంవత్సరాల తర్వాత ప్రపంచంలోని ఏ దేశమూ తన ఆహారోత్పత్తిని విదేశాలకు ఎగుమతిచేసే స్థితిలో ఉండదనీ, ప్రస్తుతం సహాయం పొందుతున్న దేశాలు స్వయం సమృద్ధిని సాధించుకోడం అవసరమనీ అమెరికన్ పాలకవర్గం అభిప్రాయమని కూడా ఆయన అన్నారు.

ఆహారమంత్రి 1965 ఏప్రిల్‌లో పార్లమెంటుకు వో 'తెల్లకాగితా'న్ని సమర్పించారు. ఆ తెల్ల కాగితంలో 1959—60 లో 31.7 మిలియన్ టన్నులు ఉన్న వరి ఉత్పత్తి 1963—64 కి 36.5 మిలియన్ టన్నులకు పెరిగిందని ఉంది. భారతదేశం స్వయం సమృద్ధిని సాధించగలదని దానిపై నిపుణులు తమ అభిప్రాయాన్ని వెల్లడించారు.

కొత్తగా నాగరికత ప్రబలిన కొన్ని ప్రాంతాల ప్రజలు వరినే ఆహారంగా ఉపయోగిస్తున్నారు. ఆహారంగా వరినివాడే వారికి గోధుమను అలవాటు చేయాలని, అదీ అత్యవసర పరిస్థితిలోనే కాకుండా ఎప్పుడూ అలాగే ఉండాలనేది ఆహారమంత్రి ప్రయత్నాల్లో ఒక భాగం. అందుకే ఆయన బేకరీల స్థాపనకు బడ్జెట్‌లో అవకాశాన్ని కల్పించారు.

## ఆధునిక బేకరీ పథకం

ఈ పథకం క్రింద కొన్ని బేకరీలను స్థాపించటం జరుగుతుంది. ప్రజలకు గోధుమను ఆహారంగా ఉపయోగించటం అలవాటు చేయాలనీ, సరసమైన ధరలకు మంచి రకం రొట్టెను వాడకందారులకు అందజేయాలనీ వీటి స్థాపనలోని ముఖ్యోద్దేశ్యం. ప్రస్తుతానికి దేశంలో ఆరుచోట్ల యీ బేకరీలు స్థాపించబడుతున్నాయి. న్యూఢిల్లీ, పశ్చిమబెంగాల్, గుజరాత్, మహారాష్ట్ర, కేరళ, మద్రాసు రాష్ట్రాలలో రాష్ట్రానికి ఒక్కటి చొప్పున స్థాపన జరుగుతుంది. దీనికయే మూలధనం, ఆస్ట్రేలియా ప్రభుత్వం కొలంబో ప్లాన్ క్రింద యిస్తానన్న సరంజామాతో కూడా, 132.6 లక్షలు. వీటికి స్థల నిర్ణయం గూడా జరిగింది. ఈడపల్లి (కేరళ), మద్రాసు, బొంబాయి, అహమ్మదాబాద్, ఢిల్లీ, కలకత్తాలలో బేకరీలు స్థాపించబడ్డాయి. వీటి నిర్మాణం బొంబాయి, కలకత్తా, ఢిల్లీలలో సెంట్రల్ పి.డబ్ల్యు.డి. ద్వారానూ, మిగతా మూడుచోట్ల రాష్ట్ర పబ్లిక్‌వర్క్స్ శాఖ ద్వారానూ జరుగుతుంది. భవనాల నిర్మాణం పూర్తి అయినవెంటనే ఆస్ట్రేలియానుంచి అవసరమైన సరంజామా వస్తుంది. బేకరీలు యే యే రాష్ట్రాలలో స్థాపించబడ్డాయో ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఒక్కొక్కటీ రు. 1000 విలువగల షేర్లను కొనాల్సి ఉంటుంది. స్థలాన్ని ఏర్పాటు చేస్తామని రాష్ట్ర ప్రభుత్వాలు వాగ్దానం చేశాయి.

ఇక ఈ బేకరీల నిర్వహణ నిమిత్తం, కంపెనీల చట్టం ననుసరించి 'మోడరన్ బేకరీస్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్' అనే పేరుతో పరిమిత బాధ్యతగల కంపెనీగా రిజిస్టర్ చేయబడింది. ఇది కేంద్రం నుంచి ధన సహాయాన్ని పొందుతుంది. రాష్ట్ర ప్రభుత్వాలు కూడా షేర్లనుకొంటాయి. మొత్తం అనుమతింపబడిన మూలధనం ఒక కోటి రూపాయలు. ఆ మొత్తంలో 50 లక్షలు షేర్ల రూపేణా, మిగతాది అప్పుగానూ యివ్వటానికి కంట్రోలర్ ఆఫ్ కాపిటల్ యిష్యూస్ ఆమోదించారు.

ఇందులో మళ్ళీ యింకో చిక్కువుంది. పిల్లలకు గోధుమ ఆహారంగా అలవాటు చేస్తే ఎప్పుడూ అదే కావాలని కూర్చుంటారు. శ్రీ సుబ్రహ్మణ్యం అంచనాల ప్రకారం భారతదేశం 1971కి స్వయంసమృద్ధిని సాధించటం యిలాగేనేమో! గోధుమ దిగుమతులపై ఎప్పుడూ భారతదేశం ఆధారపడేట్లు చేస్తుంది ఆయన పథకం.

మూడవ ప్రణాళికలో వ్యవసాయం పట్ల నిర్లక్ష్యాన్ని ప్రదర్శించినందుకు అమెరికా, ప్రపంచ బాంకులు ఆరోపణలు చేశాయి. మొదటి ప్రణాళికలో వ్యవసాయానికి చెప్పుకోదగ్గ ప్రాముఖ్యతను కల్పించారు. అయినా విదేశీయుల విమర్శకు గురయ్యారు ప్రణాళికాకారులు. తర్వాత రష్యన్ ప్రణాళికా పద్ధతిలో భారీ ఇంజనీరింగ్‌కు ప్రాముఖ్యత నిచ్చారు. మూడవ ప్రణాళిక భారతదేశంలోనే తీవ్ర విమర్శకు గురైంది. అప్పటి ప్రపంచ బాంక్ అధ్యక్షుడు శ్రీ జార్జి ఉడ్ మూడవ ప్రణాళికపై ప్రత్యేకమైన ఆసక్తిని చూపించారు. ఆయన—యు. కె., యు. ఎస్. ఏ., జర్మనీలనుంచి ముగ్గురు విజ్ఞులను ఇండియాకు పంపారు.

ఇండియాలోని ఆహారం కొరతను ప్రముఖంగా ప్రచురించిన విదేశ పత్రికలని ఆహారమంత్రి నిందించారు. అసలు ఆహారం కోసం ఇండియా అలమటిస్తున్నదన్నవిషయం విదేశ పత్రిక లెలా తెల్సుకున్నాయి? అది ఢిల్లీలోని రాయబారులను సమావేశపరచి శ్రీ సుబ్రహ్మణ్యం చెప్పిన సంగతే కదా!

# న్యూఢిల్లీ లేఖ

ముప్ఫయి నలుగురు రాయబారులూ, అంతర్జాతీయ వ్యవస్థల ప్రతినిధులు ఎవి మిదిమందీ పాల్గొన్న ఆ సమావేశంలో ఆహార మంత్రి మాట్లాడుతూ, 'ప్రస్తుత పరిస్థితిని ఎదుర్కోటానికి, త్వరలో స్వయం సమృద్ధిని సాధించటానికి భారత ప్రభుత్వం ఆహార ధాన్యాలు, ఎరువులు, క్రిమిసంహారక ఔషధాలు, యంత్రాలు మొదలగు వాటి విషయంలో మిత్ర దేశాల సహాయాన్ని హర్షిస్తుంది' అన్నారు. అందులో ప్రత్యేక మైన విన్నపాన్నొకదాన్ని ఆయన చేశారు. ప్రపంచంలో వరిని ఉత్పత్తిచేసే దేశాలు 'ఇండియా విషయంలో ప్రాధాన్యత చూపించాలి' అన్నారు. •








అమెరికా అధ్యక్షుడు, పాలకవర్గం భారతదేశానికి ప్రస్తుత పరిస్థితిని ఎదుర్కోవడానికి ఎంత సహాయం అవసరమైనా చేస్తామని హామీ యిచ్చారని శ్రీ సుబ్రహ్మణ్యం రాజ్యసభలో ప్రస్తావించారు. రాజకీయాల దృష్ట్యా మాట్లాడుతూ, మనం ఆహారానికి ఒక్క అమెరికాపైనే ఆధార పడటం అంత మంచిదికాదని, అందుకే యితర దేశాల సహాయాన్ని కూడా అర్థించామన్నారు. పదిహేడు, పద్దెనిమిది దేశాలు ఆయన కోరికకు ఆమోదాన్ని తెలిపినయి. కేరళబంధ్ ప్రపంచం దృష్టిని బాగా ఆకర్షించింది.

పోప్ కూడా సహాయంకోసం అభ్యర్థనలను చేశారు. ఇటలీలోనూ, మరికొన్ని దేశాల్లోనూవిడిగావసూళ్లు కూడాజరిగినయి.

''ఇదంతా ప్రపంచంలోని ప్రజల మధ్య ఉన్న 'స్నేహవారధి'ని సూచిస్తుంది. దాన్ని గురించి సిగ్గు పడాల్సిందేమీలేదు. ప్రపంచం లోని ఏ దేశంలోనైనా అలాంటి పరిస్థితి ఏర్పడితే ఇండియా కూడా అదేవిధంగా సహాయాన్నందిస్తుంది''

విచారాన్ని కలిగించే ఈ అభ్యర్థనే ఇటలీ, హాలెండ్, మరికొన్ని దేశాల్లో ఇండియాకు ఆహారం కొరకు పిల్లలు వెళ్లి యాచించడానికి దారితీసింది.

ఈ ఖండాంతర యాచనే 'స్నేహవారధి' అయితే ఆ రెండు మాటలూ వాటి అర్థాన్ని కోల్పోయి అయినా ఉండాలి, లేక మనుష్యుల్లో విచక్షణ జ్ఞానమైనా నశించి ఉండాలి. ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం కల్పించిన ఈ పరిస్థితిని దేశానికి పూర్తిగా తలవంపులు రాకముందే అరికట్టటం ఎంతైనా మంచిది.

దీనికితోడు ఉత్పత్తి ఎక్కువగా ఉన్న రాష్ట్రాలు మిగిలిన ధాన్యాన్ని ఉత్పత్తి తక్కువగా ఉన్న రాష్ట్రాలకు పంపటానికి విముఖతను ప్రదర్శిస్తున్నాయి. న్యూఢిల్లీకి సంబంధించి నంతవరకూ డిన్నరు, డ్రింక్‌పార్టీలులేని ఒక్క సాయంత్రం చూడాలంటే అసాధ్యమే! కరువు సంభవించే పరిస్థితుల్లో ఇండియా ఉన్నదంటే న్యూఢిల్లీని చూపిన వారు

# నిరీక్షణ

ఉన్నవ విజయలక్ష్మి (సీరియల్)

ఇక్కడ గవర్నమెంటు ఆస్పత్రిలో డాక్టరుగా కొన్ని మధ్యే వచ్చాను.

"ఎంత బాధ అనిపించినా నేర్పుగా సమస్యల్ని విడదీసుకోడానికి ప్రయత్నించి, ఎదురయిన కష్టాల నుండి గట్టెక్కడానికి ప్రయత్నించాలి కాని, ఇలాంటి సాహసానికి మాత్రం మరెప్పుడూ పూనుకోకండి. ఇంక పదండి పొద్దుపోతోంది" అంటూ వెళ్ళడానికి ఉద్యుక్తుడయాడు వేణు.

"ఒక్కక్షణం వుండండి. అంతం చేసుకుందామనుకున్న జీవితాన్ని ఆఖరి క్షణంలో మంచికో చెడ్డకో ప్రయత్నం కొనసాగకుండా చేశారు. అయితే నేనుంటున్న నరకం నుండి బయటపడి సుఖంగా బ్రతకగలిగే మార్గం ఏదైనా వుందేమో మీరే చెప్పాలి. అంతవరకు సహాయం చేయలేకపోతే నన్ను బ్రతికించి నా కష్టాల్నింకా ఎక్కువ చేశారని నేననుకోవలసి వస్తుంది.... క్షమించండి. నేనేదో మీమీద ఆధారపడతానని అనుకుంటున్నారేమో. అలాంటిదేం లేదు. నా బ్రతుకు నేను బ్రతకగలిగే మార్గం చూపించి అందుకు కావలసిన సలహా సహకారాలు యిస్తే చాలు."

"అలాగే. ఎలాంటి పరిస్థితులలోనైనా మీకు సహాయపడడానికి నా కెప్పుడూ అభ్యంతరం వుండదని మరోసారి వాగ్దానం చేస్తున్నాను. మీకున్న ఇబ్బంది లేమిటో, మీకెలాంటి సహాయం కావాలో చెప్పండి."

"ఇప్పుడు కాదు. మరోనాడెప్పుడైనా కథంతా చెప్తాను. నేను చెప్పింది సానుభూతితో వినగలిగే వారైనా ఈ నాటికి కనిపించారు."

"అసలు ముందిది చెప్పండి. మీరిక్కడికెందు కొచ్చారు. ఊరికి దూరంగా మనుష్య సంచారం లేనిచోట, నేను ఆత్మహత్య చేసుకోవడానికి [illegible] వుంటుందని సాయంత్రమే యింటి నుండి బయలుదేరి ఇంత దూరం వచ్చాను. అయినా మీరు వచ్చి ఆ ప్రయత్నం కొనసాగకుండా చేశారు." అంది తలెత్తి వేణు కళ్ళలోకి చూస్తూ.

"నాకు ఇవాళేమిటో మనస్సు బాగుండక, ఏదో ఆలోచిస్తూ యింట్లోంచి బయలుదేరాను. సాధారణంగా సాయంత్రాలప్పుడు రైలుస్టేషను దాటి ఈ రైలుకట్ట వెంట కొద్దిదూరం షికారుగా రావడం నాకలవాటే. ఇవాళ ఆలోచనల ధోరణిలో పడి చాలా దూరం వచ్చేశాను. ఎంత దూరం వచ్చానో కూడ తెలియడంలేదు. ఇంక పొద్దుపోయింది వెదిరుగుదామని అనుకుంటూనే కాస్సేపు ఈ చల్లగాలితో ఈ ప్రశాంత పరిసరాలలో విశ్రాంతి తీసుకొని వెడదామని కూర్చున్నాను.

[illegible]

శైలు పట్టాల మీద నురడి పెడుతూ కని పించారు. ఈ సమయంలో ఒంటరిగా ఒక స్త్రీ ఇలా వెడ్తోందేమిటా అని ముందు కొంత ఆశ్చర్యపోయాను. మీరు నాముందు నుండి వెళ్ళిన కొద్దిసేపటికే రైలు కూత వినిపించింది. నాకేదో సందేహం కలిగి, అవెంటనే భయంతో వళ్ళు జలదరించింది. నేను పరుగు పెట్టుకుంటూ వచ్చాను. ఎంత పిలిచినా మీరు వినిపించుకుంటేనా? నా పరుగుని మించిన వేగంతో నడుస్తున్నా రేమోనవిపించింది. ఎలాగైతేనేం మిమ్మల్ని ఇవతలకి తీసుకు రాగలిగాను. ఒక్కక్షణం ఆలస్యమయినా నా ప్రయత్నం నెరవేరేది కాదు. మీరు చచ్చిపోవడం ఆ దైవాని క్కూడ అంగీకారంకాదు. అందుకే ఇవాళ నన్నింత దూరం పంపించాడు. ఇంక పదండి. నడుస్తూ మాట్లాడుకుందాం."

"మీరు ప్రతి సాయంత్రం ఇటువేపు వస్తారన్న మాట" అంది రాధ అతని ప్రక్కనే నడుస్తూ.

"ఆ. అన్నమాటే. మరి ఈవూర్లో సాయంత్రాలు ప్రశాంతంగా గడపడానికి నాకింతకన్న మంచి స్థలాలు కనిపించలేదు. క్రొత్తగా వచ్చానేమో స్నేహితులు కూడ ఎవరూ లేరు. ఇంట్లో ఒక్కడినీ ఎంత సేపని కూర్చుంటాను."

"అదేమిటండీ, ఆస్పత్రికి దగ్గరగానే అంత చక్కటి క్వార్టర్సు పెట్టుకుని కుటుం బాన్ని తీసుకురాలేదా?"

"నాకు కుటుంబం అంటూ ఏమీ లేదింకా. చదువు పూర్తయితేనే కాని పెళ్ళి చేసుకోనని ఎలాగో ఇన్నాళ్ళు మా అమ్మని ఆపగలిగాను. చదువు అవగానే ఉద్యోగం కూడ వచ్చింది. అసలు ఉద్యోగంలో చేరే లోపునే ఆశుభకార్యం పూర్తి చేయాలని చూసింది అమ్మ. నేనే చెవిని పెట్టలేదు."

"మరి మీనాన్నగారేమంటారు?"

"నేనంత అదృష్టవంతుడినికాను. నేను నాలుగేళ్ళ పిల్లవాడిగా ఉన్నప్పుడే ఆయన పోయారు. అందుకే నేనంత అమ్మకంత గారబం ఏ విషయంలో కూడ నన్ను గట్టిగా బలవంతం చెయ్యదు." అన్నాడు తల్లిని తలుచుకుంటూ, ఓ విధమైన దర్పంతో

# నిరీక్షణ

కూడిన చిరునవ్వు అతని పెదవుల మీద మెరిసింది.

"మీకింకా అమ్మయినా ఉన్నారు. నేను తల్లీ తండ్రీ లేని దౌర్భాగ్యురాల్ని." అంది రాధ మెల్లిగా. మాతృప్రేమ తాలూకు గతించిన ఛాయలు ఆమె మనో నేత్రం ముందు సజీవంగా కదలాడడంతో ఆమె హృదయము నేత్రాలు కూడ ఆర్ద్ర మయినాయి.

"అయ్యో పాపం. మరి మీ రెవరిదగ్గ రుంటున్నారు ? అన్నయ్యలైనా అక్కయ్య లైనా ఉన్నారనుకుంటాను" అన్నాడు వేణు ఆమె దయనీయ స్థితికి సాను భూతి చూపుతూ.

"అన్నయ్యా వదినా ఉన్నారు. వాళ్ల దగ్గిరే ఉంటున్నాను. మీకు అన్నయ్యలు అక్కయ్యలు ఎంతమంది?" అంది రాధ, వేణు కుటుంబ విషయాలలో అనవసరమైన కుతూహలం చూపిస్తున్నానేమో నని సంకో చిస్తూనే.

"ఒక అన్నయ్య ఉన్నాడు. నాకన్నా పదిహేను సంవత్సరాలు పెద్ద. అతనికి నలుగురు పిల్లలు. బి. ఎల్. ప్యాసం స్వంత వూరులోనే ప్రాక్టీసు చేస్తున్నాడు. అసలు నేను కూడ అక్కడే ప్రాక్టీసు పెట్టాలని మా అందరి అభిమతమూను. కాని, కొద్దికాలమైనా ఉద్యోగం చేస్తే ఎక్కువ అనుభవం గడించవచ్చునని ఈ ఉద్యోగంలో చేరాను....."

"అన్నట్లు మీ యిల్లు ఎటువేపు ? ఇంత చీకట్లో ఒంటరిగా వెళ్ళగలరా? నే నొచ్చి దిగబెట్టనా" అన్నాడు వేణు. అప్ప టికే వాళ్ళు స్టేషను దాటి బైటికి రావ డంతో.

"ఫరవాలేదండి. ఒక్కదాన్ని వెళ్ళి పోతాను. రేపు సాయంత్రం వస్తాను. నా జీవితానికో పరిష్కారమార్గం చూసుకో వాలిగా!"

"అలాగే. తప్పకుండా రండి. వె ఎందాక చూపించిన మామిడిచెట్లు కిందే కూర్చుని మీకోసం ఎదురు చూస్తుంటాను...."

"ఉండండి. రిక్షాలో వెళ్ళరుగాని. నడిచి వెడ్తే బాగా ఆలస్యం అయిపోతుంది." అంటూ వేణు రిక్షాని పిలవబోయేంతలో,

"అబ్బే, వద్దండి. నాకు నడక అల వాటే. త్వరగానే వెళ్ళిపోతాను" అంటూ అతనింక మాట్లాడ్డాని కవకాశం ఇవ్వకుండా గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళి పోయింది రాధ.

రాధ వెళ్ళిన వేపే చూస్తూ ఒక నిట్టూర్పు విడిచి తన బంగళావేపు సాగి పోయాడు వేణు.

* * *

రాత్రి పొద్దుపోయి ఇంటికి చేరిన చెల్లెలికి వీధి వరాండాలోనే ఎదురయిన ప్రకాశం, "ఎక్కడికి వెళ్ళావమ్మా" అని అడిగాడు ఏమీ జరగనట్లే. అన్నగారి కంఠంలోని సహజత్వం రాధలో కొండంత ధైర్యాన్ని కలిగించింది.

"పార్వతిగారింటి కన్నయ్యా" అంది తలొంచుకుని.

ఆ మాటలు నమ్మలేనట్లు ఒకసారి చెల్లెలి మొఖంలోకి చూసి,

"నే నలాగే అనుకున్నానులే. అయినా ఇంత పొద్దుపోయేదాకా ఎప్పుడూ ఉండ కమ్మా. సరే పద భోజనం చేద్దాం" అంటూ లోపలికి దారి తీశాడు.

అప్పటికి మిగతా అందరి భోజనాలు అయిపోయాయి. అన్నా చెల్లెళ్ళ కోసం అన్నీ మూతలు పెట్టి ఉంచి వెళ్ళి పడు కుంది. కామాక్షి. ప్రకాశం కూడ పీట వాల్చుకు కూర్చోడం చూసిన రాధ,

"అదేమిటన్నయ్యా. నువ్వూ అన్నం తినకుండా కూర్చున్నావా ?" అంది రాధ అప్పుడే కాళ్ళు కడుక్కుని పెరట్లోంచి వస్తూ.

"పికొక్క దానికే నయించదని ఉండి పోయానమ్మా. అయినా యిప్పుడు మాత్రం ఏమంత ఆలశ్యం అయింది." అన్నాడు చెల్లెలికి కూడ ఇంకో పీట వాలుస్తూ.

ఆ సమయంలో రాధ కసలు అన్నం తినాలనిలేదు. తను తిననంటే ప్రకాశమూ తినడు. అప్పటి పరిస్థితి అలాంటిది. ఇక

అతన్ని చిన్నబుచ్చడం ఇష్టంలేక ఇద్దరికీ కంచాలు పెట్టి వడ్డించింది.

ఇద్దరూ మౌనంగానే భోజనం అయిందనిపించి చేతులు కడుక్కున్నారు.

మాటిమాటికీ చెమరుస్తున్న కళ్లని ఒత్తుకుంటూ ఆ సాయంత్రం తనకి జరిగిన అవమానాన్ని గురించే ఆలోచిస్తూ పడుకుంది రాధ.

"ఇక ఆ ఇంట్లో అలాంటి అవమానాలు కష్టాలు సహిస్తూ బ్రతకడం సాధ్యంకాదని, ఎలాగైనా సరే ప్రాణత్యాగం చేసుకోవాలని గాఢంగా నిర్ణయించుకునే యింట్లోంచి బయలుదేరింది కాని అది కూడ నెరవేరలేదు. బ్రతికుండి ఇంకా ఎన్ని బాధలు పడాలో అసలు చిన్నప్పుడేం సుఖపడిందో అంతే. ఈమధ్య అంతా కష్టాలతోనే గడిచిపోతోంది. ఇకముందైనా సుఖంగా బ్రతకగలిగే మార్గం చూసుకోవాలి. అందుకు పార్వతే ఏదైనా సహాయం చేయగలదు ఇందాకటి పెద్దమనిషి కూడ పాపం తనంటే ఎంతో జాలీ సానుభూతి చూపిస్తూ తన కథంతా వినగోరాడు. ఆయన కూడ మంచివాడిలాగే ఉన్నాడు. రేపెప్పుడైనా వీలు చూసుకుని వెళ్లి తన కథంతా చెప్పేయాలి. పార్వతి సహాయం చేయలేనంటే, ఇతనైనా ఎక్కడైనా ఏదైనా ఉద్యోగం చూపించగలడేమో అనుకోవచ్చు.

"కాని, కుటుంబం పరువు ప్రతిష్టల్ని గంగలో కలిపి, అడిగినవాళ్లందరికీ తన జీవితంలో మంచి చెడ్డలని గురించి చెప్పుకోడం భావ్యంగా ఉంటుందా. ఎవరికీ చెప్పకుండా ఉండాలనే ఎంత బాధనైనా మనస్సులో దాచుకుని గుట్టుగా పడి ఉంది యింతకాలం. ఇంక దాన్ని అలా అణచిపెట్టడం సాధ్యంకాదు. ఎవరికైనా చెప్పుకుంటే ఈ హృదయభారం కొంతైనా తీరే అవకాశం ఉంది. దానివల్ల ఇంకో మంచి కూడ జరగవచ్చు.

"ఏం. ఆమాత్రం జీవనాధారం పార్వతి చూపించలేదా ? ఏమో. పార్వతి తనలాంటి స్త్రీయే. ఎక్కడని ప్రయత్నాలు చెయ్యగలదు. ఇంతకీ ఆమె భర్త ఏమంటాడో. అసలు అత నెలాంటివాడో కూడ తెలియదు. ఈ దిక్కులేనివాళ్లందరికీ ఉద్యోగాలు చూపిస్తూ కూర్చోడమేనా నా పని, అంటాడేమో. ఏది ఎలా ఉన్నా, సహాయం చెయ్యడానికి తనంత తాము ముందుకు వచ్చిన వ్యక్తికి తన జీవిత చరిత్ర తెలియజేయడంలో ఎలాంటి తప్పూ లేదు."

అంటూ వో నిశ్చయానికి వచ్చిన రాధ మనస్సు గతంలోకి జారిపోయింది....

* * *

రామనాథంగారు ఒక సామాన్య గృహస్థు. భార్య శాంతమ్మగారు అన్నివిధాల ఆయనకి అనుకూలవతి. వారి తొలి సంతానం ప్రకాశరావు. అతని తరువాత నలుగురైదుగురు పిల్లలు కలిగినా అక్కరకు రాలేదు. ఆ తరువాతది రాధ. అందుకే ఆమె అంటే తల్లికి, తండ్రికి, అన్నగారికి కూడ అతి ముద్దు.

రామనాథంగారికి పెద్ద ఆస్తి లేక పోయినా ప్రశాంతంగా జీవితం గడిపిపోడానికి మాత్రం ఏ లోటూ లేదు. ఉంటున్న ఇల్లు కాక దగ్గరలోనే ఆరెకరాల సుక్షేత్రమైన మాగాణి కూడ ఉంది అదే స్వంత వ్యవసాయం చేయించుకుంటూ ఆ కుటుంబం ఏ లోటూ లేకుండా కాలం గడిపేస్తున్నారు.

రాధకి పది పదకొండు సంవత్సరాల వయస్సు వచ్చేసరికే పెళ్లి చేసేయాలని ఆ ముద్దు ముచ్చట్లన్నీ తీర్చుకోవాలని రామనాథంగారు సరదా పడ్డారు. కాని, అనుకూలమైన సంబంధం ఏదీ కుదరక ముందే ఆయన కళ్లు మూశారు.




అప్పటికి రాధ సెకండు ఫారం చదువుతోంది. ప్రకాశం బి. ఏ., ప్యాసయి ట్రయినింగు కూడ పూర్తి చేసుకుని ఆ వూళ్లోనే హైస్కూల్లో టీచరుగా పనిచేస్తున్నాడు. ఆ విధి నిర్వహణలో వేరే యితర పనులకి సమయం ఉండదు. కనక అయినా వ్యవసాయంపట్ల ఆసక్తి లేకపోవటం చేత తండ్రి పోగానే స్వంత వ్యవసాయపు బెడదంతా ఎత్తిపెట్టి, ఆ పొలం కవులుకిచ్చేశాడు ప్రకాశం. ఆయన తలపెట్టిన రాధ పెళ్లి ప్రయత్నాలు కూడ అంతటితో ఆగిపోయింది. ఆమె చదువుకి కూడ ఎవరూ అభ్యంతర పెట్టలేదు.

రాధ సిక్స్తుఫారం చదువుతూండగా ప్రకాశానికి పెళ్లి నిశ్చయమైంది. వాళ్లకి అన్నివిధాల కావలసిన ఒక మధ్యవర్తి ఆ సంబంధం తీసుకొచ్చాడు. అప్పుడే ప్రకాశం రాధ పెళ్లిమాట కూడ తలపెట్టి, "రాధకి చేశాక నేను చేసుకుంటా" నన్నాడు.

"ఇంతవరకు వచ్చానుకదా, ఇంకొక్క ఏడాది ఆగుతే స్కూలు ఫైనల్ పూర్తవుతుంది." అంటూ బ్రతిమాలుకుంది రాధ తల్లినీ, అన్నగారినీను.

స్కూలుఫైనల్ పరీక్షలు పూర్తవగానే మళ్లీ ఆ మధ్యవర్తే రాధకొక్కడ సంబంధం తీసుకువచ్చాడు. అక్కడికి నలభైమైళ్ల దూరంలో ఉన్న అగ్రహారంలో సంబంధం. అక్కడికి వెళ్లడానికి రైలుమార్గం లేదు. బస్సులో వెళ్లాలి. పెళ్లికొడుకు తండ్రి ఆవూరి కరణం. అన్నగారు ఏదో కొద్దిగా చదువుకుని పొలం వ్యవహారాలు అవి చూస్తున్నాడు. నలుగురు ఆడబడుచులకి పెళ్లిళ్లయి వాళ్ళు సుఖంగా కాపరాలు చేసుకుంటున్నారు. అందరిలోకి ఆఖరివాడు ఈ పెళ్లికొడుకు భాస్కరరావు. అతను బి. ఏ., చదువుతున్నాడు. వారు మంచి స్థితిమంతులు. అబ్బాయి బాగుంటాడు, చదువుకుంటున్నాడు అని చెప్పి ఆ సంబంధం నిశ్చ

62 వ పేజీ చూడండి



హాస్యనాయిక

# వాంటెడ్ ఫాదర్స్

ఆదివిష్ణు

ఆదివారం ఉదయం ఈ కథ జరిగింది. అది ఏ ఆదివారమైనా గావచ్చు. ఏవ్వాళ్లోనైనా జరుగవచ్చు.

ఈ కథకి హాస్యమే ప్రధానం గనుక చట్టానికీ న్యాయశాస్త్రానికీ ఇందులో చోటులేదు. బాబ్జి, చిట్టిబాబూ, సుబ్బారావూ, శ్రీనివాసులూ మరియు రాధ—వీళ్లెవరూ 'లా' చదువుకోలేదు. పోతే, రచయిత దురదృష్టంకొద్దీ ఈ కథకి సంబంధించిన 'లా' మాత్రం చదువుకున్నారు. గనక చట్టం ఒప్పుకపోయినా అందరూ క్షమార్హులే—ఇది రాసేందుకు ఏక కారణమైన మిత్రుడు సత్యమూర్తి గూడాను.

చిట్టిబాబుకి పుస్తకాలు చదవడమంటే చాల యిష్టం. అతను ఆ ఆదివారం ఉదయం పుస్తకపఠనంలో ఉన్నాడు. అన్ని రకాలూ ముగిసాయి. సరీగా కవిత్వంమీద దృష్టి నిలిచింది.

బాబ్జి—లేక—బాబూరావుకి వాళ్ల హెడ్ క్లార్కుని తిట్టడమంటే చాల యిష్టం. అతను ఆ ఆదివారం ఉదయం అదే కార్యక్రమంమీద వాళ్ల అద్దె గదిలోకి సుడిగాలిలా వచ్చేడు.

బాబ్జి : (వచ్చి అన్నాడు) అధికారంవల్ల కళ్లు మూసుకుపోయిన మనుషులంటే నాకు గిట్టదు. ఒకనాడు పురుగులా బ్రతికిన మనిషి సుడి తిరిగి పెద్దాడై వెలిగిపోతూన్నంత మాత్రాన పూర్వం తన పురుగు దశని మరిచిపోతే నేరం. అవునంటావా చిట్టిబాబూ ?

చిట్టి : (పుస్తకంలోంచి తల తిప్పలేదు. పెదవి దాటి మాట రాలేదు.)

బాబ్జి : అవునయ్యా ! ఆఫీసుకి లేటుగానే వెళ్లాననుకో. ఆపళంగా నన్నంతటివాడిని పట్టుకుని, ఇంత ముక్కుపొడి పట్టించి చేతులు దులుపుకుంటూ, పదిమందిలోనూ నన్ను అడుగుతాడు. 'ఏం బాబూరావూ ! ఇంతాలస్యంగా వొచ్చావూ ? ఇంటిదగ్గర పిల్లలు పోపట్టాన వదిలెట్టలేదా ? నాన్నాకాన్నీ నాన్నా అర్ధణా, నాన్నా రూపాయీ అని కాళ్లట్టుకుని ఆపేశారా ? ఏవిటి కథ ?' అని. పట్టుమని పాతికేళ్లయినా నిండలేదు నాకు. పెళ్లి కాలేదు నాకు. పిల్లలు లేరు. ఇవన్నీ తెలుసా శాల్తీకి. అయినా సరే తలతిక్క మాటలు. వొళ్లు మండుకొచ్చింది. మాటంటే పడే రకం కాదు నేను. అభిమానంతో నిండుకున్న గుండెగల వాడిని. నన్నా ఎగతాళి చేస్తాడు? చూస్తా, చూస్తా—వాడి కళ్లముందే గొప్ప బిజినెస్ పెట్టి, వాడిని నా కంపెనీలో సేల్సు అసిస్టెంటుగా పెట్టుకుని 'ఏం వాయ్? ఎలా ఉంది ఉద్యోగం' అని అడిగేస్తాను. మన తడాఖా తెలీదింకా.

చిట్టి : (గేయం చదివేడు)

నేను దానవుని సైతం
నిర్జించిన మానవుడను
కాని మానవుని జయించ
లేని లోని మానవుడను ......

బాబ్జి : (చిట్టిబాబువేపు ఎగా దిగా చూసేడు. వెళ్లికుర్చీలో కూర్చుని టాపువేపు చూపు నిలిపేడు.)

చిట్టి : ఏం రాశాడయ్యా ! కవిత్వమంటే యిలా ఉండాలి. కావల్సినంత తిరకాసుంది యీ నాలుగు లైన్లల్లోనూ. 'నేను దానవుని సైతం—'

బాబ్జి : (కాళ్లూపుతూ అన్నాడు) కమాన్ మిస్టర్ ధనుంజయరావ్ ! కమాన్.

చిట్టి : (ఉలిక్కిపడి లేచేడు. అటూ యిటూ చూసేడు. ఎవరూ కనుపించలేదు. మళ్లా కూర్చుని అన్నాడు) ధనుంజయరావ్ ఎవరోయ్ బాబ్జీ !

బాబ్జి : మా హెడ్‌క్లార్కు. నువ్వు కొంచెం నోరుమూసు క్యూర్చో! (ధనుంజయరావ్ వచ్చినట్టు భావించి అన్నాడు) ఇదేమిటి? వాటీజిట్? ఏమిటిది. మీ బొంద డ్రాఫ్టు మీరూను. దీనికింద యువర్స్ ఫెయిత్ఫుల్లీ అని ఎవ డేడవమన్నాడు? హూ ఆస్క్‌డ్ యూ టు వీవ్? (లేచి నించుని పైప్ కాలుస్తున్నట్టుగా) అవునూ మిస్టర్ ధనుంజయరావ్ మీ వయస్సెంతన్నారు.? గట్టిగా చెప్పవయ్యా. ఫోంచేయలేదా ? ఎంత ? ఫిఫ్టీఫైవా ? ఏభై అయిదు సంవత్సరాలు? నాన్‌సెన్స్—ఈ వయస్సులో మీకు ప్రేమించడా లేమిటయ్యా బొత్తిగా ? మనసంతా ఎక్కడో పెట్టుకుని కాగితాలమీద అవాకులూ చెవాకులూ పేలాతరటయ్యా ? ఇదేనా మీ ప్రీవియస్ సర్వీసులో అఘోరించిన తెలివి, నిర్వాకమూను. (ఆయాసం వొచ్చింది.)

చిట్టి : (విసుగుపుట్టింది) ఏమిట్రా తెగ కూసేస్తున్నావ్.

బాబ్జి : నువ్వు కాస్తాగు చిట్టిబాబూ ! మధ్యలో దోమలాగా బాధపెట్టకు. (మళ్లా ప్రారంభమైంది వ్యూహోగానం) యస్ మిస్టర్ ధనుంజయరావ్ ! మీరు ఫలానా ఆఫీసులో ఎన్నాళ్లు పనిచేశారన్నారూ? ముప్ఫైఅయిదు సంవత్సరాలా ? హెడ్ గుమాస్తాగానే రిటైరయ్యారా ? వెరిగుడ్. మీ కెవడిస్తాడు ప్రమోషన్. డోంటాక్ మిస్టర్ ధనుంజయరావ్, నామాటకి అడ్డు పడొద్దు. మీ ఆఫీసులో బాబూరావ్ ఫురఫ్ బాబ్జి అనే యువకుడు పనిచేసేవాడు గుర్తుందా ? ఉంటుం దుంటుంది. నాకది తెలుసు ముందా చేతులు కట్టుకు నించోడం మానేయండి.

ఆ బుద్ధావతారం ఫోజు నా కిష్టంలేదు. అతి వినయం ధూర్తలక్షణ మన్నారు. ఇంత తిడుతున్నా నేమిటాని బాధగా ఉందా ? అందునా తెలుగులోనే తిడుతున్నా నేమిటని. అవునా ? అవును. ఇవాళ ఏంవార మన్నారు ? మీకు వారఫలాలు చూడటం తెలుసా ? అసలు మీరు తెలుగు పత్రికలు చదువుతారా ?

చిట్టి : (కోపం వొచ్చింది) ఛ .... పోయి పడుకోఁ బాబ్జీ ! వెధవ సంధివాగుడూ నువ్వూను. మీ హెడ్ క్లార్కుమీద అంత కోపమైతే, ఏ సందులోనైనా వంటరిగా చూచి రెండు వాయించు. లేదా, హోటల్ బుహారీకి తీసుకెళ్లి బాగా మేపి మంచి చేసుకో. అంతేగాని, యిలా రోజూకెన్ని గంటల చొప్పు పని చెప్పి నీలో నువ్వే గొణుక్కోవడం ఏమంత మంచిదికాదు. విశాఖపట్నం వెళ్లిపోగలవ్. జాగ్రత్త

బాబ్జి : అదుగో—వెధవ పాము చెవులూ మీరూను మా ఫ్రెండ్ నా కేదో సలహా యిస్తూంటే వంగి వంగి వింటారెందుకు ? ఇంకా చేతులు నలుపుకుంటూ వింటుంటారేం ? గెటవ్‌ట్ ఫస్టయిసే.

చిట్టి : బాబ్జీ! ఎవడైనా చూస్తే నవ్వుతాడు గానీ నోరుమూసుకూర్చో.

బాబ్జి : (కళ్లల్లో నీళ్లు నింపుకున్నాడు) ఎన్నాళ్లని నోరుమూసు కూర్చోమ్రా? నన్ను తినేస్తున్నాడ్రా ముక్కుపొడి యమధర్మరాజు.నా నెత్తురు తాగుతున్నాడు. ఏదో ఒక శుభోదయాన ఈ వెధవ వెట్టి చాకిరీకి గాజీనామా యిచ్చి బిజినెస్ పెట్టుకు బ్రతుకుతాను. అప్పటివరకూ నాకు మనశ్శాంతి లేదోయ్ చిట్టిబాబూ !

చిట్టి : పాడు బిజినెస్సు నువ్వూను. ఆ ముక్క వొదిలెట్టవుగదా ! బోరుకొట్టి ఛస్తున్నాను.

బాబ్జి : (కోపం వచ్చింది) వ్యాపారాన్ని తక్కువ చేయకు చిట్టిబాబూ ! వక్కపొడి తయారుచేసి పొడలుకట్టి నల్లకారుల్లో కిళ్లీలు నములుతూ తిరిగేవాళ్లెవరయినా ఈమాట వింటే నిన్ను నమిలి మింగేయగలరు. ఉద్యోగంలో ఏముందోయ్ వల్లకాడు. నువ్వు చేస్తూన్న గుమాస్తా జీవితం చేదుగా లేదని నీ గుండెమీద చెయ్యి వేసుకు చెప్పగలవా ? లేవు. నాకది తెలుసు. రోజూ మీ హెడ్‌క్లార్కు—

చిట్టి : నోర్మూయ్. మళ్లా ఆ పేరెత్తావంటే నీ నెత్తురు కళ్లజూస్తాను. జాగ్రత్త. మాకు హెడ్ క్లార్కు లుండ రనలు.

బాబ్జి : పోనీ మరో దిక్కుమాలిన బాస్ ! ఎవడైతే నేం—ఒక మొగుడు. వాడు రోజస్తమానం నీ ప్రాణాలు తోడేస్తుంటే సహించి వూరుకోడం ఎన్నాళ్లు చేస్తావ్ ? జీవితపర్యంతం ఒకడి చెప్పుకింద మల్లెమొగ్గలా నలిగిపోవడం నీ కిష్టమా? కాదు. కనక ....

చిట్టి : (గబగబా లోపలికి వెళ్లబోయేడు.)

బాబ్జి : కనకనే అఖిలాంధ్ర అప్పడాలూ మరియు విస్తళ్ల తయారీ సంస్థకి ప్లాన్ వేస్తున్నాను.

చిట్టి : (ఆగిపోయేడు. ఆశ్చర్యపోయేడు.)

బాబ్జి : (చాలా సీరియస్‌గా చెప్పేడు.) పేపరు వర్కయిపోయింది. ఇహ అమల్లోకి రావడమే తరువాయి. మా సంస్థ ఉద్దేశాలూ, వాటి సత్ఫలితాలూ విపాదిగా మనవి చేస్తాను. టూకీగా చెప్పాలంటే ఇటీజవిడోస్ ఫూల్. విధవలందరికీ ఉపాధి కల్పించడమే ముఖ్యోద్దేశం. రాష్ట్రమంతటా బ్రాంచిలు. వాటికి మేనేజర్లు. అప్పడాలకి, విస్తళ్ళకీ యీరోజున యింపార్టెన్స్ పెరిగిపోయింది. సాక్ష్యం, కోకొల్లలుగా పుట్టుకొస్తోన్న హోటళ్లు, జనంనూ. ఈ బిజినెస్‌కి పెట్టుబడి తక్కువ. ఇట్ విల్ స్టార్ట్ విత్ స్మాల్ కేపిటల్. కొన్నాళ్లు స్వయంకృషి అవసరం. నాకు అప్పడాలు చేయడం వచ్చు. విస్తళ్లు కుట్టగలను. అనాదరణలో క్రుంగిపోయే సుబ్బమ్మలూ, చిన్నతనంలో మొగుళ్లు పోయిన వెంకాయమ్మలూ యీ సంస్థలో ఎంప్లాయీస్.

చిట్టి : (ఇంతవరకూ శ్రద్ధగా వినమూ లేదు. లోపలికి వెళ్లడం ప్రారంభించేడు.)

బాబ్జి : ఒకమనిషి పట్టుదలకొద్దీ హోటల్లో చెయ్యి కడుక్కోడం విడవకపోతే, అతనివల్ల—కేవలం అత నొక్కడివల్ల, రెండు నెలల్లో హోటలు గోడలు మొత్తానికీ సున్నం వేయించవచ్చునే సూత్రాన్ని తీసుకొని వందిమంది—

చిట్టి : (వెళ్లిపోయాడు.)

బాబ్జి : నాన్‌సెన్స్. వీళ్లెవరికీ బిజినెస్ మజా తెలీదు. గానుగెద్దులా బతకమని దేవుడు రాసిన రాతకి తలొగ్గిన మనుషులు వీళ్లు. (మళ్లా వూహా ప్రపంచంలోకి దిగిపోయేడు) యస్ మిస్టర్ ధనుంజయరావ్! వాట్ డూ యూ వాంట్ నౌ! శెలవా? గట్టిగా చెప్పవయ్యా ? మీ కేమిటి కావాలి. లీవా? అలా గంగిరెద్దులా తలూపకు. నాకు చిరాకు. స్పీక్. మాట్లాడు. నాలుగు రోజుల శెలవా ? నో. ఇవ్వను. ఇవ్వనంతే. ఇంకా నించున్నారే. ఇవ్వనని చెప్పాగా. వెళ్లండి. ఏమిటి మీ మనవడికి జొరమా ? వీకెండింగ్‌లో ఆఫీసులో మీ ర్లేకపోతే నాకొచ్చే జొరం ఎవరితో చెప్పుకోను ? వెళ్లండి. వెళ్లి మీ పని చూచుకోండి. ఇవాళ సాయంత్రం ఆరుగంటల్లోపు నేను చెప్పిన స్టేట్‌మెంటు తయారవ్వాలి. ఏమిటి మీ ముక్కు అంత అసహ్యంగా ఉందేమిటి ? ముక్కుపొడి పీల్చడం, ముప్ఫైమూడుసార్లు తుమ్మడం సభ్యత కాదని తెలీదు ? తుమ్మొస్తే కొంచెం నెమ్మదిగా తుమ్మడం నేర్చుకోండి. బంగళా టాపు లేచేట్టు తుమ్మితే ఈ గదిలో వంటరిగా బిక్కు బిక్కుమంటూ కూర్చున్న నా గతేంకాను? అసలీ ఆఫీసులో తుమ్మడా ల్లేవని రేపొద్దున బోర్డు కట్టేయండి. నా కది చూపించి మరీ కట్టండి. వెళ్లండి. యూకెన్ గో నౌ !

(సుబ్బారావు వొచ్చి నించున్నాడు. దిగులుగా పిలిచేడు.)

సుబ్బా : బాబ్జి !

బాబ్జి : యస్. కమిన్ !

సుబ్బా : నేను సుబ్బారావుని. కొంచెం తెలివి తెచ్చుకుని మాట్లాడు. నీ పుణ్యముంటుంది.

బాబ్జి : రా గురూ ! రా. ఎంతసేపయింది వొచ్చి.

సుబ్బా : చిట్టిబాబు ఉన్నాడా ?

బాబ్జి : లోపల కవిత్వం చదువుకుంటున్నాడు. వాడూ ఈమధ్య ఏదో రాయాలని ప్రయత్నిస్తున్నట్టు కనుపిస్తోంది. నన్నడుగుతే ఈ రాయడమనేదీ గూడా—

సుబ్బా : (ఎగతాళిగా అన్నాడు) ఒక గొప్ప బిజినెస్!

బాబ్జి : మంచి మాటన్నావ్. కుర్రాడంటే యిలా ఉండాలి. బాకులాగా మాట నందుకోవాలి. ఇంగ్లీషువాడు బిజినెస్ చేయడాని కొచ్చి రాజ్యాన్నే దోచేడు. అప్పలస్వామి కిళ్లీషాపుతో బిజినెస్ ప్రారంభించి సినిమాహాలు కొని యిప్పుడు సినిమాలే తీస్తున్నాడు. పున్నయ్యశెట్టి చేగోడీలు చేసి నాలుగు హోటళ్లు నడుపుతున్నాడు. రేపొద్దున యీ బాబ్జి లక్షలు గడించేసి—కూర్చోవయ్యా, 'నించునే ఉన్నావ్ ! (కూర్చోపెట్టాడు) నా ప్లానేమిటంటే, అఖిలాంధ్ర అప్పడాలు మరియూ విస్తళ్ల తయారీ సంస్థని...

సుబ్బా : (లోపలివేపు చూసేడు) చిట్టిబాబూ ! తొరగా రా !

బాబ్జి : మధ్య అతనెందుకు మళ్లీ ! అఖిలాంధ్ర అప్పడాలు—

సుబ్బా : అయ్య బాబోయ్ ! నే విన్ను బాబ్జి ! నీ బిజినెస్‌కీ నీకూ వో దండం. (లేచేడు గుమ్మం దగ్గరికి వెళ్లాడు) చిట్టిబాబూ! చిట్టిబాబూ !

(బాబ్జీకి కోపం వొచ్చింది. రుసరుసలాడుతూ వెళ్లిపోయేడు, చిట్టిబాబు నవ్వుతూ వొచ్చేడు.)

చిట్టి : వెళ్లిపోయాడ్రటోయ్! నా ప్రాణాలు కొరికేస్తున్నాడు వీడు. వీడికేదో పిచ్చెక్కిందని నా అనుమానం. రోజస్తమానం ఆఫీసులో ఎద్దులా పని చేస్తాడా ? దానికేమో వీళ్ల హెడ్‌క్లార్కు కొంచెమైనా మెచ్చుకోడు. పైపెచ్చు ఖస్సుబుస్సు లెక్కువట. దాంతో వీడి మనసు బేజారెత్తిపోయింది. ఇరవైనాలుగ్గంటలూ ఈ రకమైన గోడు. వీడి స్థితి చూస్తుంటే వో పక్క నవ్వూ, మరోపక్క జాలీను.

సుబ్బా : బాబ్జి సంగతి కాసేపలా ఉంచు. నే నిప్పుడు అతి ముఖ్యమైన పనిమీ దొచ్చేను. నీ చేతులూ కాళ్లూ పట్టుకు బ్రతిమాలుకునే స్థితిలో ఉన్నాను. సాయంచేస్తే చర్మం వలిచి చెప్పులు కుడతాను.

చిట్టి : (నవ్వేడు తేలిగ్గా) ఎవడిదిట ? నా చర్మమా ?

సుబ్బా : (సీరియస్‌గా అన్నాడు) హాస్యం కాదు నాన్నగారూ !

చిట్టి : అదేమిట్రోయ్ ! నేను నాన్నగార్నేమిట్రా నీ బొంద.

సుబ్బా : నాన్నగారూ ! మీరు దీన్ని చాలా సీరియస్‌గా తీసుకోవాలి. నా దుస్థితి నుంచి నన్ను తప్పించేది మీ రొక్కరే నాన్నగారూ !

చిట్టి : నన్నలా పిలవద్దురా సుబ్బారావూ ! వంటిమీద జెర్రులు పాకినట్టుంది. మామూలుగా 'చిట్టిబాబూ' అనే పిలు.

సుబ్బా : చిట్టిబాబు నాన్నగారూ ! నన్నపార్థం చేసుకోవద్దు. నేను చెప్పేది విని—

చిట్టి : వినను. వినను. నువ్వు నాకు కొడుకువి కావు. నేను నీకు తండ్రినీ కాదు. ఫో .... ముందీ గది దాటు.

సుబ్బా : ఇది తెలుగు సినిమాకాదు నాన్నగారు! నిజమైన జీవితాలు మనవి. మీరు నాకు నాన్నగారే. సాక్షాత్తు దైవస్వరూపులు.

చిట్టి : (కోపం వొచ్చింది) ఏమైనా తాగొచ్చేవేమిట్రా సన్నాసి ! మీ నాన్నగారికీ విషయం తెలుస్తే నీ డొక్క చింపేగలరు. వెళ్లు. ఆదివారం హాయిగా అనుభవించు. వెళ్లిపో.

సుబ్బా : వెళ్లను గాక వెళ్లను. మీ పాద పద్మాలను దాటి ఒక్క అంగుళమైనా కదలను నాన్నగారు. నన్ను చంపండి, కొట్టండి, తిట్టండి మిమ్మల్నొదిలి నేను వెళ్లను. నా కథ వింటె....

చిట్టి : ఇంతవరకూ బాబ్జిగాడు బోరి వెళ్లేడు.

ఇప్పుడు నువ్వు తయారయ్యావుట్రా. ఏమిట్రా నీ కథ !

సుబ్బా : నాన్నగారూ !

చిట్టి : ఛీ ! నోర్ముయ్! ముందా కథేమిటో చెప్పి చావు.

సుబ్బా : నా కథ వింటారా నాన్నగారూ !

చిట్టి : ఇంకోమాటు ఆ పేరుతో పిలుస్తే దవడపళ్ళు రాలగొడతాను.

సుబ్బా : నేను ప్రేమించాను నాన్నగారూ !

చిట్టి : అఘోరించక పోయేవు.

సుబ్బా : తప్పేముంది నాన్నగారూ ! తండ్రి పోలికలే కొడుక్కూను. మీరు రాధమ్మగార్ని ఎంత పవిత్రంగా ప్రేమించేరో నేనూ అంత పవిత్రంగానే ప్రేమిస్తున్నాను నాన్నగారూ !

చిట్టి : మధ్యలో పోలిక లెందుకోయ్. ప్రేమించావ్. అయితే నన్నేం చేయమంటావ్.

సుబ్బా : సాయం చేయమంటాను నాన్నగారూ ! సాయం.

చిట్టి : మధ్యలో నా సాయ మేమిటోయ్. డైరెక్టుగా వెళ్ళి ఆ పిల్లతో నీ ప్రేమ సంగతి చెప్పు.

సుబ్బా : చెప్పేను నాన్నగారూ ! ఒప్పుకుంది.

చిట్టి : అయితే మీ పెద్దాళ్ళతో చెప్పి, వాళ్ళ పెద్దాళ్ళతో చెప్పించి—

సుబ్బా : అన్నీ అయ్యేయి నాన్నగారూ ! నన్ను చెప్పనివ్వండి పూర్తిగా. (ప్రారంభించేడు.) మా యింటిప్రక్క మీసాల పోలీసాఫీసరుగారు మీకు తెలుసుగా.

చిట్టి : తెలుసు. ఆయన్ని ప్రేమించేవా ?

సుబ్బా : బోడివిట్లు చేయకండి నాన్నగారూ! నే చెప్పేది వినండి. వాళ్ళమ్మాయి జ్యోత్స్నని ప్రేమించేను. మనసిచ్చేను. జ్యోత్స్న మనసూ సంపాయించేను. మా యిద్దరి ప్రేమా—నాన్నగారి ముందు నాకు సిగ్గెందుకు— వెన్నెల్లా చల్లగా, వెన్నలా మెత్తగా, మధువులా తీయగా—

చిట్టి : నీ బొందలా చేదుగా... ఆపవోయ్ వెధవ

# వాంటెడ్ ఫాదర్స్

కవిత్వమూ నువ్వూను (సిగరెట్టు తీసి ముట్టించబోయేడు.)

సుబ్బా : వొద్దు నాన్నగారూ ! మీరిక సిగరెట్లు కాల్చరని రాధమ్మగారనుకుంటున్నారు. మీరు సిగరెట్లు కాల్చకూడదు. కేన్సరొస్తుంది. చచ్చిపోతారు. ఆ సిగరెట్టు నా మొహాన్న కొట్టండి. నేను కాల్చుకుంటాను.

చిట్టి : నోర్ముయ్.

సుబ్బా : నా మాట వినండి నాన్నగారూ ! ఆ పాడు సిగరెట్లు మీరు కాల్చకండి. ఈ వయస్సులో అది మంచిదికాదు. అసలే మీ ఆరోగ్యం అంతంత మాత్రం.

చిట్టి : (విసుగు పుట్టింది. సిగరెట్టు కాల్చకుండానే చెప్పుకింద పెట్టి నలిపేడు) ఛీ. చంపేస్తున్నావురా సుబ్బిగా. సరి. నీ ఏడుపేదో చెప్పు.

సుబ్బా : నేను జ్యోత్స్నని ప్రేమించేను.

చిట్టి : అది చెప్పేవ్.

సుబ్బా : మా పెద్దవాళ్ళూ, వాళ్ళ పెద్దవాళ్ళూమా మా పెళ్ళికి వొప్పుకున్నారు నాన్నగారూ !

చిట్టి : అయితే యింకేం. ఎంచక్కా పెళ్ళి చేసుకోండి. మీ పెళ్ళికి మేమూ వస్తాం.

సుబ్బా : ఎంతమాటన్నారు నాన్నగారూ ! మా పెళ్ళి మీ రాకుండా ఎల్లా జరుగుతుంది ? మీ చేతుల మీదుగానే మా పెళ్ళి జరగాలి. నన్నో యింటివాడిని చేసే బాధ్యత మీది.

చిట్టి : మళ్ళా యిదేం తలతిక్కరా బాబూ !

సుబ్బా : నాకో అన్నయ్య ఉన్నాడు నాన్నగారూ వాడు వేదాంతి. ఈ పెళ్ళి, ఈ పెళ్ళాం, ఈ జీవితం, ఈ ప్రపంచం అన్నీ మిథ్య అని చెప్పి యింట్లో వో మూల కూర్చుని గోళ్ళు గిల్లుకుంటున్నాడు. వాడికీ జీవిత కాలంలో పెళ్ళికాదని నాకు తెలుసు. పెద్దవాడు—వాడికి పెళ్ళికాందే నేను పెళ్ళి




చేసుకోరాదని మా యింట్లోవాళ్ళ నిర్ణయం. నా పెళ్ళికి వాడి పెళ్ళి ముడి. ఈ ముడి విడదు. నా ప్రేమా, నా జీవితం, నా కలలు, నా ఆశలు అన్నీ వృధాయేనా నాన్నగారూ ! అందుచేత.

చిట్టి : వూఁ. అందుచేత.

సుబ్బా : మీరే నా నాన్నగారు !

చిట్టి : ఇదేమిటి ?

సుబ్బా : చిన్నమార్గం. నా ఆనందమయ జీవితమనే తాళం కప్పకి విలువైన తాళంచెవి మీరు. నన్ను దత్తత తీసుకోండి. మీ కొడుగ్గా స్వీకరించండి. నా పెళ్ళి మీరు చేసిపెట్టండి. మా అన్న సన్యాసుల్లో చేరి తిరిగినా నా కప్పుడు ఇబ్బంది ఉండదు. కానీ జ్యోత్స్న లేని ఈ జీవితంలో వెలుతురుండదు. నన్ను కనికరించండి నాన్నగారూ! దత్తత చేసుకోండి. నాకో కొత్త జీవితాన్ని ప్రసాదించండి.

చిట్టి : (ఖంగారు పుట్టింది) వెళ్ళిపో సుబ్బిగా! తొరగా వెళ్ళిపో. ఈ విషయం ఎవరితోనైనా చెబితే నవ్వుతారు గానీ ఎవర్తో చెప్పకు. వెధవ అయిడియాలూ నువ్వూను.

సుబ్బ : నవ్వుతారా నాన్నగారూ ! ఎవరు నవ్వుతారు ? ఎందుకు నవ్వుతారు ? నాకు పెళ్ళవుతుందని నవ్వుతారా ? జ్యోత్స్న నాకు భార్య అవుతుందని నవ్వుతారా ?

చిట్టి : అదేం కాదురా బాబూ ! నేను నీ బాబు నవుతానని! నీకెన్ని గుండె లున్నాయిరా సుబ్బారావూ! ఈ ప్రపంచంలో నీ కింకెవరూ దొరకనట్టు నాకు వలవేశావా ? నాకు దత్తతతో అవసరమేమి టసలు? వయస్సు ముదిరిపోతున్న ముసలితాతనా ? కాదే ! పెళ్ళయి ఇరవై సంవత్సరాలు ముగిసినా నలుసు కలగని దురదృష్టవంతుడినా ? కాదే ! అథవా నువ్వేమైనా పసిపిల్లవాడివా ? కావే ! పోనీ, నాకేమైనా పెళ్ళంటూ అయ్యిందా ? లేదే.

సుబ్బ : అబ్బబ్బ .... నాన్నగారూ ! మీ పసితనం చూస్తుంటే నవ్వొస్తుందండి నాకు. నన్ను దత్తత చేసుకోమని అడిగేను. నిజమే. దానికి మీరు చెప్పిన కారణాలు ఏవీ గావు— అవునని నేనూ, కాదని మీరూ వాదించుకునేందికి. నా పెళ్ళి జరగాలి. జ్యోత్స్న నాకు కావాలి. మా అన్నయ్యకీ జన్మలో పెళ్ళికాదు. ఇలాంటి పరిస్థితిల్లో నాకు నాన్నగారు కావలసి వచ్చేరు. అందుచేతనే మిమ్మల్ని ఆశ్రయించేను నాన్నగారూ! రాధమ్మతో మీ పెళ్ళి జరగబోతోంది. అంతవరకూ నేనూ ఆగుతాను. మీ పెళ్ళి ముగిసిన నెల రోజుల్లో తీరుబడి చిక్కేం తర్వాత నన్ను దత్తత చేసుకోండి. నన్నో యింటివాడిని చేయండి. అది చాలు నాన్నగారూ !

చిట్టి : అది నా చేతకాదు. ఎవరైనా వింటే నన్ను ఎగతాళి చేస్తారు. నువ్వు చావుగాక! అంత తెలివితక్కువ పని నే నసలు చేయను. రేపొద్దున రాధకీ సంగతి తెలుస్తే ఏమైనా ఉందా ? హవ్వ !.... మీ అంత కొడుకు మన కప్పుడే యెందుకండీ అని నన్ను యాగీ చేయగలదు. నువ్వు నన్ను నాన్నగారూ అని పిలిచినా నేను సహించి వూరుకుంటున్నాను. కానీ రాధని అమ్మా అని పిలుస్తే, రాధ రెండో రోజు నూతిలో దూకి చస్తుంది. వెళ్ళిపో సుబ్బారావ్. నీ పెళ్ళి నా చావుకొచ్చింది. నా బ్రతుకు చీకటి చేయకు. ఆ పాడు కోరిక కోరకు. వెళ్ళు.

సుబ్బ : వెళ్ళను నాన్నగారూ ! ఏమైనా సరే

అర్జంటు ఆఫీసుపని...కాని రామారావుకు తలనొప్పి







రామారావు ఒక సారిడన్ వేసుకొనును



తరువాత...




# ఒకే ఒక సారిడన్ 'రోష్'

## నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహమును కలిగించును

నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన సారిడన్ నొప్పులనుండి త్వరితముగా, నిరపాయముగా, విశ్వసనీయంగా ఉపశమనం కలిగిస్తుంది. తలనొప్పి, పంటినొప్పి, ఒళ్లునొప్పులు, సాధారణ అస్వస్థతలు ముదలైనవాటి నివారణకు ఎల్లప్పుడూ సారిడన్ వాడండి. పెద్దవారికి ఒక బిళ్ళ; పిల్లలకు ¼ నుంచి ½ బిళ్ళవరకు వెయ్యవచ్చును.




ఒకే ఒక సారిడన్ బిళ్ళ చాలును



'రోష్' తయారు    ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్ లిమిటెడ్






# వాంటెడ్ ఫాదర్స్

వెళ్లను. మీరు నాకు అభయహస్త మివ్వాలి. నేను వెళ్లాలి. మీ కొడుకు భీరువుకాదు. పట్టుదల మూర్తీభవించిన ఘనుడు. సరే కానీండి నాన్నగారూ ! నే నిలాగే యీ గదిలోనే ప్రాణాలు సైతం విడుస్తాను గానీ మీచేత కాదనిపించుకుని వెళ్లలేను.

చిట్టి : ఇదెక్కడి ఖర్మంరా తండ్రీ ! చంపేస్తున్నావురా సుబ్బారావూ !

సుబ్బ : కొడుకు తండ్రిని చంపలేడు పైపెచ్చు పున్నామ నరకాన్ని నామరూపాలు లేకుండా చేస్తాడు. నన్ను దత్తత చేసుకొని ఆ నరకాన్నుంచి తప్పించుకోండి నాన్నగారూ !

చిట్టి : ఏమైనా, సరే నువ్వు నాకు కొడుకువి కాదు. అవ్‌ట్. గెటువ్‌ట్.

సుబ్బా : (కోపం వొచ్చింది) సరే—నాన్నగారితో పాటు మాట పెంచుకోడం కొడుకు చేయదగ్గ పని గాదు. వెడతాను. సరాసరి మా కాబోయే మావయ్య దగ్గరికి వెడతాను. ఆయన మీసాల పోలీసాఫీసరు. ఈ వూళ్లో సరసతిని చలికాలంలో రగ్గులా కప్పుకున్న మనిషి. వెళ్లి యీ ఉదంతమంతా చెప్తాను. ఫలానా నాన్నగారు నా కన్యాయం చేయడం మూలంగా నేను మీ పుత్రికారత్నాన్ని పెళ్లిచేసుకోలేకపోతున్నానని చెప్పేస్తాను. ఆ తర్వాత క్షణం నుంచి ప్రారంభమవుతుంది వేట. వేట నాన్నగారూ ! పోలీసువాళ్లు తలుచుకుంటే ఒక మంచి మనిషి బ్రతుకు పదుగురి నోళ్లలో పడి నానిపోవడం ఏమంత దుస్సాధ్యమైన కార్యంకాదు. మీమీద సవాలక్ష కేసులు బనాయించగలరు. పది రోజుల్లో మీ అత్యాచారాలు మా రాధమ్మగారికి తెలుస్తాయి. 'ఛీ' అని లోనొకమాటు అనుకుని పై కొకసారి మీ మొహమ్మీదనేసి తలుపేసేసి పొమ్మంటుంది. దాంతో మీ పెళ్లి ఆగిపోతుంది. అనక విచారించి నా దగ్గరికొచ్చి 'ఏమిటిది కొడకా ! నాకో దారి చూపించు నాయనా!' అని గొడవ చేసినా లాభముండదు. కాబట్టి బాగా ఆలోచించి వో నిర్ణయానికి రండి నాన్నగారూ ! ఆలోచించండి.

చిట్టి : ఒరేయ్ ! ఎంత గొడవ తెచ్చిపెట్టావురా సుబ్బారావూ ! ఇప్పుడీ పరిస్థితుల్లో నన్నేం చేయమంటావురా బాబూ !'

సుబ్బా : నన్ను దత్తత చేసుకుంటానని మాటివ్వండి. మీ చేతులు కళ్ల కద్దుకు వెళ్లిపోతాను. నా చేతనైన విధంగా యీవేళ మీకో సన్మానం చేసుకుని పుత్రధర్మాన్ని పాటిస్తాను. మాటివ్వండి నాన్నగారూ ! ఆలస్యం చేయకండి.

చిట్టి : (ఒప్పుకోక తప్పిందికాదు) సర్లే. వెళ్లు. ఈ విషయాన్ని ఎవర్తోనూ చెప్పకు.

సుబ్బా : ధన్యుడ్ని నాన్నగారూ ! నా కిప్పుడు ఆనందంగా ఉంది. మా నాన్నగారు ....

చిట్టి : నీటికి మాటికి నన్నా పేరుతో పిలుస్తే గొంతు పిసికేస్తాను. జాగ్రత్త. రేపు ఎవర్తోనైనా ఫలానా మనిషి నీకు ఫలానా అని చెబితే నా తల కొట్టేసినంత పనవుతుంది. వెళ్లింక.

సుబ్బా : థేంక్స్ నాన్నగారూ !

చిట్టి : అదుగో మళ్లా ! వెళ్లిపో. ఇక్కడే నించుని నా ప్రాణాలు తీయకు. వెళ్లు.

(సుబ్బారావు పరుగెత్తుకుంటూ వెళ్లిపోయేడు)

**చిట్టి : అబ్బ ! గాలి వాన వెలిసింది. దుంపతెంచి** వెళ్లిపోయేడు వెధవ. వీడికీ పాడుబుద్ధి ఎలా పుట్టిందో గానీ ఇంజనీరు అనిపించుకున్నాడు మొత్తానికి.

(బాబ్జీ మొహం తుడుచుకుంటూ వచ్చేడు. తనే వెనగ్గా హెడ్‌క్లార్కు వస్తున్నట్టు భావించి విసుక్కున్నాడు.)

బాబ్జి : మిస్టర్ ధనుంజయరావ్ ! నా వెనకలా బాడీగార్డులా తిరక్కపోతే మీ యింటి కెళ్లిపోరాదూ! మీవాళ్లు మీకోసం ఎదురుచూడరటయ్యా. ఆఫీసై రెండుగంటలయ్యింది. నాకూడా తిరగటానికి మీకు సిగ్గు వెయ్యడంలేదు. ఇంక మీరేం చెప్పొద్దు. మీ గురించి నాకు చాలా తెలుసు.

చిట్టి : (బాబ్జీవేపు ఎగాదిగా చూచి అన్నాడు.) వూ .... వీ డొహడు. పిచ్చిమాలోకం. అప్తమానూ. యీ పారాయణంతో నన్ను అదరగొట్టేస్తున్నాడు.

బాబ్జి : (కూర్చున్నాడు) యస్ మిష్టర్ ధనుంజయరావ్ ! మీ శెలవు విషయం రేపు ఆలోచించి చెప్తాను. మీరు వెళ్లిపోవచ్చు. బైట వెంకాయమ్మ నించుంది కాబోలు రమ్మని చెప్పండి. వెళ్లండి! దట్సాల్‌రైట్.

చిట్టి : (కుతూహలం కలిగింది) వెంకాయమ్మ ఎవ్రా బాబ్జి !

బాబ్జి : యంగ్ విడో. బ్యూటీఫుల్ ఎంగ్ విడో. మొగుడు మిలట్రీలో చేరి దేశంకోసం ప్రాణా లర్పించేడు. వెంకాయమ్మ నా పర్సనల్ అసిస్టెంట్. అఖిలాంధ్ర అప్పడాలూ మరియూ విస్తళ్ల తయారీ సంస్థ యజమానికి ఆంతరంగిక కార్యదర్శి. (వెంకాయమ్మ వచ్చినట్టు వూహించేడు.) కమిన్ వెంకాయమ్మ. కమిన్. కాకినాడ బ్రాంచివాళ్లు పదివేలకి చెక్కు పంపేరు. ఆ బ్రాంచి మేనేజరు సంతకం సరిగ్గా లేదు. అది వెంటనే రిటర్న్ చేస్తూ చార్జిషీటు ఇవ్వండి. అతని సంజాయిషీ నాకు వారం రోజుల్లో చేరాలి. చెక్కు బిరవ్ దగ్గరుంది. తీసుకోండి. అన్నట్టు ఆ బిరవ్‌కి కొంచెం తలతిక్క ఉన్నట్టు తెలిసింది. కొంచెం వళ్లు దగ్గరెట్టుకుని పనిచేయమన్నానని చెప్పండి. ఇది ఫైనల్ వార్నింగని గూడా గుర్తు చేయండి. అవునూ—ఆ మునిరత్నమ్మ శెలవు ఎప్పుడు పూర్తవుతుందిట. రేపు వుండేలోనా ? ఆవిడ ప్రోగ్రెస్ ఏం బాగోలేదు. హెచ్చరించండి.

చిట్టి : ఇక వీ డింతలో బిజినెస్ నుంచి బైట పడడు. (లేచి నించున్నాడు.)

బాబ్జి : కూర్చోరా ! యస్ వెంకాయమ్మా ! మీరిక వెళ్లచ్చు. నా గదిలోకి మరెవర్నీ పంపించకండి. మా ఫ్రెండ్‌తో సొంత విషయాలు మాట్లాడుకోవాలి. దట్సుగూడ్.

చిట్టి : (నిజం చెప్పేడు) ఒరేయ్ నీ హడావిడి చూస్తుంటే నాకే మతి పోతోంది. పాపం నీ కెలా ఉందో ఏమిటో ? నువ్వింత హంగామా చేస్తున్నావా—ఒక్కోమాటు ఇదంతా నిజమే ననుకుని గాభరా పడిపోతాను. పోనీ వోసారి బుచ్చిరెడ్డిగారికి కనిపించకూడదూ.

బాబ్జి : ఎవరాయన ?

చిట్టి : మెంటల్ స్పెషలిస్టు. ఎన్నో పెద్ద పెద్ద కేసులు క్యూర్ చేశారు. నీది ముదిరిపోయిన పిచ్చి కూడా కాదు కాబట్టి.

బాబ్జి : ఏడిశావ్‌లేవోయ్ ! అకాడికి నువ్వో పెద్ద మతున్న మనిషైనట్టు. నన్నడుగుతే ఈ భూమ్మీద

బ్రతికే ప్రతి ప్రేవరూ పిచ్చిదేనని చెప్తాను. లేపోతే మా హెడ్‌క్లార్కు—

చిట్టి : నే వినను ఆ కథ.

బాబ్జి : ఆయన కాపోతే మరో దామోదర్రావ్. పుట్టేం తర్వాత చచ్చేది పచ్చి నిజమని అందరికీ తెలిసిందే కదా ? ఇవాళ రేపు అనే కాలం మధ్య వాయిదాలు వేసుకుంటూ బ్రతుకున్నవాళ్ళం మనం. అవునా. ఇంత భాగ్యానికే ఒహడ్ని మరోహాడు మోసం చేయడం, రాచి రంపాన్న పెట్టడం, కడుపు కొట్టడం, ఖూనీలు చేయడం—ఇవన్నీ తెలివుండే చేస్తున్నా డంటావా ? కాబట్టి చిట్టిబాబూ మనందరం ఏదోరకంగా పిచ్చివాళ్ళమేనోయ్.

చిట్టి : ఇప్పుడే. నువ్వొచ్చేముందు సుబ్బారావు వెళ్ళిపోయేడు.

బాబ్జి : చూసేను. నే నున్నప్పుడు నీకోసం వొచ్చేడు.

చిట్టి : వెధవ పెద్ద యిరకాటంలో పెట్టి వెళ్ళేడు.

బాబ్జి : ఏమిటో కథ ?

చిట్టి : ఏముంది వాడిని నేను దత్తత చేసుకోవాలిట.

బాబ్జి : వాట్ ! నీదగ్గరేమాత్రం ఆస్తి ఉందేమిటి ?

చిట్టి : నువ్వొహడివి. చెప్పేది పూర్తిగా విను. వాడో అమ్మాయిని ప్రేమించేడు. వీళ్ళిద్దరి ప్రేమనీ అటూ యిటూ పెద్దవాళ్ళు ఆమోదించి పెళ్ళి కొప్పుకున్నారు. అవుతే సుబ్బారావుకి వో అన్నయ్యున్నాడు. అతనికి పెళ్ళిమీద మోజులేదు. అంచేత అతను పెళ్ళి చేసుకోడు. అతని పెళ్ళికాందే సుబ్బారావుకి పెళ్ళి కాదు. అందుచేత దత్తతకి పోయి మరో అయ్య చేతిమీదుగా తన పెళ్ళి చేయించుకోవాలని సుబ్బారావు ఉద్దేశం. వాడి ప్లాను నా మీదకి పారింది. నా పెళ్ళయిం తర్వాత సుబ్బారావుని నేను దత్తత చేసుకోవాలిట.

బాబ్జి : బాగుంది. మంచి బిజినెస్. ఇంతవరకూ కనీ వినీ ఎరుగని సరికొత్త బిజినెస్. ధన్యుడివి చిట్టిబాబూ ! నీ రొట్టె విరిగి నేతిలో పడ్డది.

చిట్టి : అవు. నీ బిజినెస్సూ నువ్వూ కలిసి గంగలో దూకండి. నేనోపక్క చిక్కు సమస్యతో సతమత మవుతూంటే మధ్య నీ బోడి బిజినెస్సేమిటోయ్ !

(ఆవేళకి శ్రీనివాసులు బిక్కు బిక్కుమంటూ వచ్చి నించున్నాడు. అతని చూపులో దిగులు తాండవిస్తోంది.)

చిట్టి : ఏమిటోయ్ శ్రీనివాసులూ ! ఇలా వచ్చేవ్ ?

బాబ్జి : దివాలా తీసినట్టు ఆ పోజేమిటోయ్.

శ్రీను : (చిట్టిబాబువేపు చూసేడు దిగులుగా).

చిట్టి : ఏమ్మొం దేమిటి ?

బాబ్జి : ఇంటిదగ్గరంతా కులాసాయేనా ?

శ్రీను : (చిట్టిబాబు వేపే చూస్తున్నాడు.)

చిట్టి : తొరగా చెప్పి చావు. సస్పెన్స్ ఎందుకు ?

శ్రీను : (ఏడుస్తూ అరిచేడు.) డాడీ !

చిట్టి : (ఉలిక్కిపడ్డాడు) ఏమిటోయ్ మీ నాన్నగారు కులాసాయేనా ?

శ్రీను : క్షేమమే డాడీ ! అందర్నూ క్షేమమే. నేనే మతిపోయి తిరుగుతున్నాను.

చిట్టి : (భయం వేసింది) నీకు సుబ్బారావు కనిపించాడా ?

శ్రీను : అవును డాడీ !

బాబ్జి : డాడీ ఏమిట్రోయ్ చిట్టిబాబూ !

చిట్టి : నా కొంపతీశాడు బాబ్జి ! సుబ్బారావు నీతో ఏమ్మైనా చెప్పేడా శ్రీనివాసులూ !

శ్రీను : మీరు యువ ప్రపంచానికి చేస్తున్న సేవ శ్లాఘనీయం డాడీ ! మీ ఋణాన్ని మే మెలా తీర్చుకోగలం.?

చిట్టి : (నిట్టూర్చేడు) విన్నావుట్రా బాబ్జి ! వీడు రెండోవాడు. మా చిన్నబ్బాయ్ శ్రీనివాసులు.

శ్రీని : (ఆనందంగా అన్నాడు.) అది చాలు డాడీ ! ఆమాట చాలు. వస్తా (వెళ్ళబోయేడు).

చిట్టి : (కోసంగా అరిచేడు) ఆగు. ఎవర్రా నీకు డాడీ ! చెప్పు. ఆ సుబ్బారావుగాడితోనూ చెప్పు డొక్క చించేస్తానని. నాకే కొడుకులూ లేరు. నాకు పెళ్ళయినా నే నెవర్నీ దత్తత చేసుకోను. (బాబ్జి మెల్లిగా లోపలి కెళ్ళిపోయేడు) ఎవడైనా నన్ను నాన్నా అని పిలిస్తే వళ్ళు చీరేస్తాను. పోండి. అందరూ దొంగలే.

శ్రీను : బాగా ఆలోచించి మాట్లాడండి డాడీ ! ఈ వయస్సులో ఉద్రేకపడటం సహజమే. కానీ—

చిట్టి : (ఉడుక్కున్నాడు) నాకెంత వయస్సని నీ ఉద్దేశం. నీకంటె ఏడాది పెద్దవాడ్నేమో అంతేగా.

శ్రీను : నో మై డియర్ డాడీ ! ఆవేశపడకండి. మా బాధ నర్థం చేసుకోండి. నా కథ వినండి.

చిట్టి : వినడాని కేముంది. నువ్వూ సుబ్బారావులాగా ఎవరో అప్పల నరసమ్మని ప్రేమించిఉంటావ్.

శ్రీను : ఎక్జాక్ట్లీ డాడీ ! కానీ ఆ అమ్మాయి పేరు పద్మావతి. రెండు జడల పద్మావతి. తెలుగు మాష్టరమ్మాయి.

చిట్టి : మీ అన్నయ్య అడ్డు తగిలేడు. అతను వేదాంతి. పెళ్ళిమీద మోజులేదు.

శ్రీను : కరెక్ట్ డాడీ ! కాని అన్నయ్య చదువు యింకా పూర్తికాలేదు. వాడింకా ఎన్నేళ్ళు చదువుతాడో తెలీదు. ఈ పరిస్థితుల్లో మీరు నన్ను గూడా దత్తత చేసుకోక తప్పదు.

చిట్టి : నో.

శ్రీను : ప్లీజ్ డాడీ ! మీరు దయామయులని తెలుసు. మీరు నామాట అంగీకరిస్తారనీ తెలుసు. కాపోతే కొంచెం పట్టు. కొడుకుల ముందు అదెంత సేపుంటుందిలెండి. మేము మారాముచేస్తే చెప్పవలసిన మీరే మారాము చేస్తున్నారా డాడీ !

చిట్టి : నేను సుబ్బారావుని గూడా దత్తత చేసుకోను. మీరిద్దరూ అరిచి గీపెట్టి చచ్చినా సరే నాకీ తంతు వద్దు. మనశ్శాంతి ఉండనివ్వండి. వెళ్ళండి.

శ్రీను : మనశ్శాంతి. మమ్మల్ని దత్తత చేసుకుంటే మీకు మనశ్శాంతి ఉండదా డాడీ ! మేము మీ మనసుని తినేస్తామా డాడీ ! ఆలోచించండి. మీరలా సాయం సమయాల్లో రోడ్డువెంట షికారు కెడుతున్నప్పుడు అటుపక్క, యిటుపక్క జనం మిమ్మల్ని చూచి ఆనందంతో అంటారు. "లుక్. ఆయనే చిట్టిబాబుగారంటే. ఇద్దరు పిల్లలు. ఇద్దరూ ఇంజనీర్లే. పెద్దాడు భిలాయ్. రెండోహాడు ఎన్‌సాగర్. ఆయనకేమిటి తక్కువ. కాలుమీద కాలేసు కుర్చోవచ్చు." ఇంత గౌరవం మావల్ల మీకు వస్తుంది. మీరు దీన్ని కాదంటే ఎల్లా డాడీ? మీ అందమైన జీవితాన్ని మీరే పాడుచేసుకుంటున్నారన్నమాట. ఇది తెలిపితక్కువతనమని చెప్తాను.

చిట్టి : నువ్వేమైనా చెప్పు. నేనేమీ వినదల్చుకో

# ఉగాది

ఏమన్నవి? ఏ మన్నవి?
చేదుపూల మధువు పిండు
తేనెటీగ లే మన్నవి?
బ్రతుకు బరువులో హాయివి
బడయు టెరిగి కొమ్మన్నవి!
ఏమన్నవి? ఏమన్నవి?
మోడు మ్రాకు లేమన్నవి?

కష్టమయం శౌశిశిరము
గడువగనే నవవసంత
మరుగుడెంచు సుమ్మన్నవి!
ఆశ నిలుపు కొమ్మన్నవి!!

ఏమన్నవి? ఏమన్నవి?
ఎలకోయిల లేమన్నవి?
ప్రణయగీతితో జంటను
పరవశింపుమని యన్నవి!

ఏమన్నది ఏమన్నది?
ఈ ఉగాది యేమన్నది?
అవనిలోన తీపి చేదు
ఆస్వాద్యములే యన్నది!

ఏమన్నవి? ఏమన్నవి?
మల్లె మొగ్గ లేమన్నవి?
అరవిరిసిన వలపులోని
పరువమ్ములు కనుమన్నవి!

ఏమన్నది? ఏమన్నది?
ఈ వసంత మేమన్నది?

జీవితమున నవ వసంత
శోభ గూర్చు కొమ్మన్నది!
బ్రతుకు మల్లె పందిరియై
పరిమళించవలె నన్నది!
పరమళించవలెనన్నది !!

—పిక్కలంక లక్ష్మీపతిరావు

# వాంటెడ్ ఫాదర్స్

లేదు. నా బ్రతుకేదో నన్ను బ్రతుకనివ్వండి. అదే పదివేలు.

శ్రీను : పోనీ యీ ప్రశ్నకి జవాబు చెప్పండి డాడీ! మీరు రాధమ్మగారి మాట తీసేయగలరా? ఆవిడమాటకి ఎదురు చెప్పగలరా ?

చిట్టి : అఫ్‌కోర్స్. చెప్పలేను. అవుతే,

శ్రీను : ఏంలేదు. నే నిప్పుడు మమ్మీ దగ్గర కెళ్లాల్సి ఉంటుంది. వెళ్లి 'మమ్మీ మమ్మీ! డాడీతో నా దత్తత విషయం చెప్పండి నే నిలాటి దుస్థితిలో ఉన్నానావటా' ని చెప్తాను. అప్పుడు ఆవిడ నాపట్ల జాలిని ప్రదర్శించి ఆవళంగా మిమ్మల్ని పిలిపించి 'చిరంజీవి శ్రీనివాసులు, మన రెండో అబ్బాయ్ చెప్పింది బాగున్నది గనక మీరు వప్పుకోక తప్పద' ని అంటుంది. మమ్మీ మాట మీకు వేదవాక్కు. మాట తీసేస్తే మీ మనసు బాధపడుతుంది. పైగా— యీ చిన్న విషయాన్నే కాదన్న మీరు రేపు మమ్మీని సుఖపెడతారనే నమ్మక మేమిటి ? అంచేత మమ్మీ మిమ్మల్ని పెళ్లిచేసుకోనని ఖచ్చితంగా చెబుతుంది. కాబట్టి ఏతావాతా తేలిందేమిటయ్యాం టే—

చిట్టి : షటప్. నాకు పిచ్చెత్తుతుంది.

శ్రీను : డాడీ! ఒక పిచ్చేనా ? పిచ్చి ముదిరి మంచి క్లయిమాక్సు కొచ్చి మీ పీకని మీరే నులిమేసు కుంటారు. ఇదంతా ఎందుచేత, రాధమ్మని మీరు పెళ్లిచేసుకోలేకపోవడంచాత. అదెందుచాత, మమ్మల్ని దత్తత చేసుకోలేక పోవడంచాత. అదెందుచాత.

చిట్టి : నా ఖర్మ కాలడంచాత. మొత్తానికి నాచేత ముప్ఫైమూడు చెరువుల నీళ్లు తాగించేస్తున్నారు మీరు. వెళ్లండి. ఈనాటినుంచి మీ రిద్దరూ నా కొడుకులే. చిరంజీవి సుబ్బారావు మొదటి కొడుకు, చిరంజీవి శ్రీనివాసులు రెండో కొడుకని వప్పుకున్నాగా! వెళ్లింక.

శ్రీని : థాంక్స్ డాడీ! థాంక్స్.

(శ్రీనివాసులు వెళ్లిపోయాడు. బాబ్జీ ఓ బోర్డుని తన వెనగ్గా దాచి తీసుకొచ్చేడు.)

బాబ్జి : కాబట్టి దీని విషయ మేమిటో మా హెడ్‌క్లార్కు—కాదు—మిష్టర్ ధనుంజయరావ్ చెప్పేరు. ఇప్పుడు నా రెండు ముక్కలు.

**చిట్టి :(ఏడుపొచ్చింది) ఒరేయ్ ఒరేయ్—మీరంతా** కలిసి నన్ను చంపుకుతింటున్నార్రోయ్! నేను పారి పోతాను.

బాబ్జి : డబ్బు కావాలి. సుఖం కావాలి. ఉద్యోగం కావాలి. పెళ్లి కావాలి. పెళ్లాం కావాలి. ఇల్లు **కావాలి. స్థలం కావాలి. అప్పు కావాలి.** ఇలాగ—మనిషి అనే ఒకేఒక వస్తువుకి సవాలక్ష కోరికలు. ఈ కోర్కెలు తీరేందుకు మార్గాలూ ఉన్నాయి. కొన్ని ఆచరించదగ్గవి, మరికొన్ని కానివీను. 'నాన్నలు కావాలి' 'వాంటెడ్ ఫాదర్స్' ఈ నినాదం ఈమధ్య కొంచెం విజృంభించింది. ప్రేమ అనే వస్తువు చుట్టూ అనేకమైన ప్రతిబంధకా లుంటాయి. అన్నింటినీ జయించి ప్రేమ ఫలించే రోజొచ్చేసినా కొసమెరుపన్నట్టు ఇంట్లో పెళ్లికాని పిల్లలు మరి కొంతమంది ఉండి ఉంటారు. అలాంటప్పుడు ఆ యింటినుంచీ, ఆ కుటుంబ సభ్యత్వంనుంచీ తప్పుకోచ్చేయాలి. న్యాయంగా పోచ్చేందుకు దత్తత అనే మార్గం ఉంది. అందుచేతనే మేమింత ధైర్యముగా చెప్పగలుగుతున్నాం.—ఇలాంటి అవస్థల్లో ఇరుక్కున్న యువకులకు మేము వో మహదవకాశాన్ని యివ్వబోతున్నాం. ఇక్కడ నాన్నలు దొరుకుతారు. అన్ని రకాల నాన్నలూ దొరుకుతారు. (బోర్డు చూపించేడు. దానిమీద—'ఇక్కడ నాన్నలు దొరుకు తారు'—అని రాసి ఉంది.) ఆంధ్రదేశంలోని యువకుల ప్రేమ వర్ధిల్లాలి. ఆ ప్రేమలోతోబాటు ప్రతిబంధకాలూ వర్ధిల్లాలి. మా అవసరం నాళ్ళకీ రావాలి.

చిట్టి : ఛీ ... ఛీ ... యిక్కడ నేనో క్షణమైనా ఉండలేను!....పోతున్నాను.

(చిట్టిబాబు గుమ్మం దగ్గరికి వెళ్లి తక్కున ఆగిపోయేడు. రాధ వచ్చింది. రాధ రాకతో చిట్టిబాబులో మార్పు వచ్చింది. అత నిప్పుడు కొంచం కుదుటపడ్డాడు. వాళ్లిద్దర్నీ చూపి బోర్డు కుర్చీ వెనక దాచి బాబ్జి లోపలికి వెళ్లిపోయేడు.)

చిట్టి : ఇవాళ ఎవడి మొహం చూశానో గానీ మన సంతా గందరగోళమైంది రాధా!

రాధ : ఏం జరిగిం దేమిటి ?

చిట్టి : ఒక విషయం చెప్తావా రాధా ? నీకు పిల్లలంటే యిష్టమా కాదా ?

రాధ : అదేం ప్రశ్న ?

చిట్టి : రేపొద్దున మన పెళ్లయిం తర్వాత పిల్లలుంటారు గదా ?

రాధ : ఉండనీండి. పిల్లలన్నా పువ్వులన్నా యిష్టంలేని ఆడదుంటుందాండీ ఎక్కడైనా ?

చిట్టి : అంఃతే కూర్చో ముందు.

రాధ : (కూర్చుంది.)

చిట్టి : ఇప్పుడు చెప్పు మన పిల్లలు ప్రయోజకులైతే మనకెంత ఆనందంగా ఉంటుంది ?

రాధ : బ్రహ్మానందంగా ఉంటుంది.

చిట్టి : పెద్దకొడుకు ఎం. ఇ., భిలాయ్‌లో ఉన్నాడు. రెండో కొడుకు బి. ఇ., యన్. సాగర్‌లో ఉన్నాడు.

రాధ : బాగానే ఉంది గానీ యిద్దరూ ఇంజనీర్లేనా ? వెరైటీకోసం ఒకడ్ని మెడిసిన్ చదివిద్దాము.

చిట్టి : అది కుదరదు.

రాధ : భలే. మీ యిష్టమేనేమిటి అంతాను!

**చిట్టి : దేవుడు రాసిందాన్ని తప్పించలేము రాధా! అది మన తరంకాదు.**

రాధ : మనిద్దరి పిల్లలూ ఇంజనీర్లనే చెప్పేడా దేవుడు.

చిట్టి : చెప్పడమేమిటి నాన్‌సెన్స్. వాళ్లిద్దరూ ఇంజనీర్లే. ఒకడు భిలాయ్. రెండోవాడు యన్.సాగర్

రాధ : చాలా దూరంగా ఉన్నారండీ!

చిట్టి : వెధవల్ని అండమాన్ పంపిస్తే యింకా బాగుండేది.

రాధ : అదేం మాటండి బొత్తిగా!

చిట్టి : నీకు తెలీదు రాధ! వాళ్లిద్దరూ రెండు రాక్షసులు.

రాధ : (కోపం వొచ్చింది.) మరీ చోద్యంగా మాటాడేస్తున్నారు. మనకి పెళ్లి కాలేదు. ఏంలేదు. అప్పుడే యిద్దరు కొడుకులు. ఇద్దరూ ఇంజనీర్లే భిలాయ్, సాగరూ, రాక్షసులూ. ఏమిటీ వరస ?

చిట్టి : పిచ్చి రాధా ! నీకేం తెలీ దసలు ! నీ కెలా చెప్పాలో అర్థంకావడంలేదు. పెద్దాడున్నాడు చూడు వాడు మిసాల పోలీసాఫీసరు కూతురు జ్యోత్స్నని ప్రేమించేడు.

రాధ : ఎవరు ? మా జ్యోత్స్ననే ! రేడియోలో పాడుతుంది !

చిట్టి : ఆహా ! అక్షరాలా ఆ అమ్మాయినే. రెండో వాడు రెండు జడల పద్మ, మన తెలుగు మాస్టా రమ్మాయిని ప్రేమించేడు.

రాధ : ఏమండి ? మీరే జన్మ గురించి మాటాడు తున్నారు. మన పిల్లలేమిటీ, వాళ్ళిద్దర్నీ ప్రేమిం చడ మేమిటండీ బాబూ ! మీకేం పిచ్చెత్త లేదుగదా?

చిట్టి : ఇంతకుమునుపు నిక్షేపంలా ఉన్నాను. మన పిల్లలొచ్చి నా మనసు పాడుచేశారు.

రాధ : (చిట్టిబాబుని పట్టుకు కుదిపింది. కళ్ళ ల్లోకి తిన్నగా చూచి అడిగింది) నాకు భయంగా ఉంది. మీరలా మాట్లాడొద్దు. మన పిల్లలు రావడ మేమిటండీ ? అసలేం జరిగిందండీ ?

చిట్టి : (రాధ చేతులు తొలిగించుకున్నాడు) నేను నిజమే చెప్తున్నాను రాధా ! నిజమే చెప్తున్నాను. మా సుబ్బారావు మన పెద్ద కొడుకు. శ్రీనివాసులు చిన్న కొడుకు చిరంజీవి రెండు.

రాధ : ఈమధ్య మాయదారి పుస్తకా లెక్కువ చద వటం మొదలెట్టారు మీరు. వెనక జన్మా, ముందు జన్మా నా శ్రాద్ధంను. చదివింది చదివినట్టు వదిలేయాలి గాని మనసులో పెట్టుకుంటార్టండీ ఎక్కడైనా ? రామరామ.

చిట్టి : (గట్టిగా అరిచేడు) రాధా, నే చెప్పేది విను. పూర్తిగా విను. అసలేం జరిగిందంటే మొట్టమొదట సుబ్బారావొచ్చి నన్ను 'నాన్నా' అని పిలిచేడు.

రాధ : అదేం పాపం.

చిట్టి : ఛ. ఫో వెధవా అని కూకలేశాను. తర్వాత చెప్పేడు. జ్యోత్స్నని పెళ్లిచేసుకోడానికి అందరూ వప్పుకున్నార్ట. వాడి అన్నయ్యేకడు వేదాంతంలో మునిగి పెళ్ళొద్దూ పెళ్లామొద్దూ అని కూర్చు న్నాట్ట. అతనికి పెళ్ళికాందే, వీడిక్కాదు. అయ్యిందా —అంచేత ఆ యింటి నుంచి వొచ్చేసి మనకి దత్తతగా వొచ్చేస్తాట్ట. మనం వాడి పెళ్లి చేయాలిట. కాబట్టి వాడో మన మొదటి కొడుకు. రెండు శ్రీనివాసులు. డిటో కేసు, డిటో బాధ. కొంచెం తేడాలు. నన్నే ఆశ్రయించేడు. ముందేదో నవ్వులాటగా తీసు కున్నాను. కానీ బెదిరించి మరీ నాచేత వొప్పించేరు. మనకిప్పుడు ఇద్దరు కొడుకులు రాధా ! ఇద్దరు. అయ్య బాబోయ్ ఇద్దరు.

రాధ : బాగుంది వరస. ఇప్పుడు నన్నేం చేయ మంటారు.

చిట్టి : నే నొప్పుకున్నాను. నువ్వూ వప్పుకుంటే.

రాధ : మరి మన పెళ్లి కాలేదుగా యింకా.

చిట్టి : ఆషాఢమాసం వెళ్లిం తర్వాత లగ్నా లున్నాయంటగా.

రాధ : ఉన్నాయిట.

(బాబ్జి రెప్పపాటులో వాళ్లిద్దరిముందూ ప్రత్యక్ష మయ్యేడు. అతని చేతిలో యిప్పుడు ఫైలొకటి ఉన్నది.)

బాబ్జి : స్టాప్ రాధగారు. కొంచెం ఆగండి (సీరి యస్‌గా అడిగేడు.) అపునూ—ఆషాఢ మాసమంటే ఎన్నినెల లుంటుందోయ్ చిట్టిబాబూ !

# పెప్సోడెంట్ యొక్క ఇరియమ్ ప్లస్

మీ పళ్లను శుభ్రపరచి
మెరిసేలా తెల్లగా చేస్తుంది

ఎలాగో చూడండి : పెప్సోడెంట్‌లో మాత్రమే అద్భుతమైన నురుగును యిచ్చే శాస్త్రపద్ధతిలో తయారైన ఇరియమ్ ప్లస్ చేర్చబడినది. ఈ అద్భుతమైన నురుగు సమృద్ధిగా కలిగి మీ నోటిలో అన్ని మూలలకు చేరి పళ్లను శుభ్రముగా, చల్లగా, పెప్పర్‌మింట్ రుచితో ఉంచుతుంది. అంతేకాదు, మీ పళ్లను మెరిసేలా తెల్లగా చేయుటకు ఇరియమ్ ప్లస్‌కు తెల్లదనమునిచ్చే ప్రత్యేకమైన శక్తికూడ ఉంది.




హిందూస్తాన్ లీవర్
లిమిటెడ్ వారి
ఒక విశిష్టమైన తయారు

(HVT HDL-3620)

# వాంటెడ్ ఫాదర్స్

రాధ :(నవ్వబోయి ఆగిపోయింది.)

చిట్టి : (కొరకొర చూసేడు) ఎన్నినెల లేమిటి నీ బొంద. మాసమంటే మంత్. నెల.

బాబ్జి : బాగుంది. అయితే నెల రోజుల తర్వాత మన సంస్థ ప్రారంభించవొచ్చన్నమాట. (ఫైలుతీసి ఏదో చూసేడు.)

చిట్టి : వీడొకడు రాధా ! వాడి పిచ్చితో నాకు పిచ్చెత్తించేస్తున్నాడు.

రాధ : ఏమిటండీ ఆ సంస్థ.

బాబ్జి : (ఫైలు మూసి సీరియస్‌గా అన్నాడు) రాధగారూ ! మీరైనా నన్ను సరిగ్గా అర్థం చేసుకుంటారని ఆశిస్తాను. మీరు సావధానంగా వినండి. పెళ్లయిన వాళ్లు పెళ్లి కానివాళ్లకి సాయం చేయాలి. వంద అబద్ధాలైనా చెప్పి ఒక్క పెళ్లి చెయ్యమన్నారు. మనం చేయబోయే బిజినెస్‌లో ఒక్క అబద్ధమైనా లేకుండా వంద పెళ్ళిళ్లు జరిపిస్తాం.

రాధ : మనం చేయబోయే బిజినెస్సా ?

బాబ్జి : నా మాటకి అడ్డు రాకండి రాధగారూ ! నన్ను పూర్తిగా చెప్పనివ్వండి. మీరు చిట్టిబాబుని పెళ్లి చేసుకుంటున్నారు. నేనూ ఎవర్నో ఒకర్ని చేసుకోక తప్పదుకదా. అవునాండి. ఇప్పుడు మీ రిద్దరూ, మే మేమిద్దరం మొత్తం మనం నలుగురం యీ బిజినెస్‌లో భాగస్థులవుతాం. ఇహ బిజినెస్సేమిటంటే (ఇందాక దాచిన బోర్డు పైకి తీశాడు. రాధకి చూపించేడు) "ఇక్కడ నాన్నలు దొరుకుతారు" నాన్న అవసరం ఎంతటిదో, ఎందరికా అవసరం కలుగుతుందో మీ కిప్పుడే తెలుస్తోంది. నాకు భవిష్యత్తూ తెలుసు. నా మెదడులో అన్నీ ఏర్పాటు చేసుకున్నాను. సంతకాలు చేయడం, నియమాలు రాసుకోడం మిగిలిపోయింది. (బోర్డు కింద పెట్టి ఫైలు తీశాడు) మీరు వూఁ అన్నారూ అంటే నిమిషంలో అంతా సిద్ధం చేస్తాను. రేపేవేళకి పేపరు పబ్లిసిటీ—

చిట్టి : నోర్ముయ్.

రాధ : చెప్పనివ్వండీ.

చిట్టి : రాధా ! నీకు తెలీదు. వీడుత్త పిచ్చి సన్నాసి. వాళ్ల హెడ్‌క్లార్కుని తిడుతున్నప్పుడు నువ్వినలేదు.

బాబ్జి : నాకోపం తెప్పించకు. చిట్టిబాబూ ? చూడండి రాధా ! ఉద్యోగం చేయడంకంటె వ్యాపారం పెట్టుకోడం మంచిదని నా ఉద్దేశం. ఆ వ్యాపారాన్ని అందంగా వూహించుకోడం తప్పు కాదుగదా. ఇది వీడికి గిట్టదు. నాకు పిచ్చెత్తిందని పిచ్చి ప్రచారం చేస్తున్నాడు.

(అంతలో సుబ్బారావూ, శ్రీనివాసులూ ఇద్దరూ వచ్చేరు. ఇద్దరి చేతుల్లోనూ పూలదండ లున్నాయి.)

శ్రీను : గుడ్‌మార్నింగ్ మమ్మీ !

రాధ : (ఉలిక్కిపడింది. చిట్టిబాబువేపు బిత్తరపోయి చూచింది.)

సుబ్బా : మా అదృష్టం పండింది. సాక్షాత్తూ దైవస్వరూపు లిద్దరూ యిక్కడే ఉన్నారు. ఏదో మాకు తోచిన యీ కొద్ది సన్మానంతో....

చిట్టి : సన్మానమూ వొద్దూ, శ్మశానమూ వొద్దు. పొండి. ముందిక్కడ్నుంచి కదలండి.

శ్రీను: డాడీ! విసుక్కోకండి. మీ రిచ్చిన మాట నిలుపుకోండి. మాట తప్పకండి. అనవసరంగా మనసు పాడుచేసుకోకండి..

సుబ్బా : ఇది నా ప్రేమ అనే పూలదండ. స్వీకరించండి నాన్నగారూ ! (దండని చిట్టిబాబు మెళ్లో వేశాడు.)

శ్రీను: ఇదిగూడా తీసుకుని మమ్మీ కివ్వండి డాడీ! (దండ నిచ్చేడు.) ఇప్పుడు మీ రిద్దరూ ఒకరి పక్కన మరొకళ్లు నించోండి.

సుబ్బా : కరుణించిన దేవతలకి పాదాభివందనం చేస్తున్నాం.

చిట్టి : ఏడవలేకపోయేరు ! (దండల్ని తీసి విసిరి పారేయబోయేడు.)

బాబ్జి : వద్దురా చిట్టిబాబూ ! పారేయకు. పూలు నలిగిపోతాయి.

చిట్టి : చూశావా రాధా, వీళ్లందరూ కలిసి నన్ను చిత్రహింస చేస్తున్నారు. నువ్వలా బొమ్మలా నుంచో వద్దు రాధా ! చెప్పు .... మనం ఎవర్నీ ఎప్పుడూ దత్తత చేసుకోమని చెప్పు రాధా !

శ్రీను : నో మమ్మీ. వద్దు.

సుబ్బా : అమ్మగారు నాన్నగారిలా మనసులేని మనిషిగాదు. ఎంతైనా తల్లి ! ఆడమనసు రాయి కాదు.

రాధ : (బిక్కుబిక్కుమంటూ అన్నది) నన్ను కొంచెం ఊపిరిపీల్చుకోనివ్వండి.

శ్రీను : భలే. రండి. ఇలా వొచ్చి కూర్చోండి మమ్మీ. వొరే అన్నయ్యా విసినకర్ర పట్రా.)

సుబ్బా : ఈ పొడుకొంపలో అవి దొరకవురా తమ్ముడూ !

రాధ : (కూర్చుంది) ఒకవిధంగా నేను మీ యిద్దరికీ బుుణపడి ఉన్నాను.

సుబ్బా : అమ్మమ్మ! అమాటనకండమ్మా ! అమ్మ కొడుకుల కెప్పుడూ బుుణపడి ఉండదు.

రాధ : కాదు. నిజంగానే బుుణపడి ఉన్నాను. నాకో మార్గం చూపించేరు మీరు. మనమంతా ఒకే జాతి మనుషులం. నిన్న మొన్నటివరకూ మాఅక్కయ్య పెళ్లవుతుందని అందరం అనుకున్నాం. మేమిచ్చే కట్నం చాలదని ఉత్తరం వచ్చింది. అనుకున్న దానికంటే కాణీ గూడా ఎక్కువ యివ్వనని మొండికెత్తేరు నాన్న. అక్కయ్య పెళ్లాగి పోయింది. అక్కయ్య పెళ్లి జరుగుతేనే గాని నా పెళ్లి జరగదు.

బాబ్జి : (ఆనందంగా అన్నాడు) బ్రహ్మాండం. ఎక్సలెంట్. వండర్‌ఫుల్.

చిట్టి : రాధా! నువ్వు చెప్పేదంతా నిజమేనా ?

శ్రీను : మమ్మీ ! మమ్మల్ని అన్యాయం చేయకండి. పూర్తిగా మిమ్మల్నే నమ్ముకునాం. నట్టేటో ముంచకండి. మీరు నాన్నగార్ని పెళ్లిచేసుకోవాలి. మా పెళ్లి మీ రిద్దరూ చేయించాలి.

సుబ్బా : లేదురా ! అమ్మగారు 'జోక్' చేస్తున్నారు. నాకు తెలుసుగా.

రాధ : ( పేలవంగా నవ్వింది.) లేదు. నేను నిజమే చెప్తున్నాను. ఈమాట చెప్పడానికే యిలా వొచ్చేను.

బాబ్జి : దెన్. మీరు గూడా 'వాంటెడ్ ఫాదర్' నన్నమాట! వెరీగుడ్.

చిట్టి : నువ్వు నోరుమూసుకో. నన్ను కొంచెం ఆలోచించనివ్వు.

బాబ్జి : ఆలోచించేందు కేముంది చిట్టిబాబూ! రాధగారు గూడాను—

సుబ్బా : అయ్య బాబోయ్. కథ అడ్డం తిరిగింది.

బాబ్జి : కరెక్ట్.

శ్రీను : ఎలా ? ఈ సమస్య నెలా సాధించాలి.

బాబ్జి : (గొంతు సవరించుకున్నాడు) కాబట్టి



# వాంటెడ్ ఫాదర్

మీరంతా ఒకే పడవమీద గోదారిలో ప్రయాణం చేస్తున్నారు. మీరు ప్రయాణంచేసే పడవ అతి ప్రమాదమైన పరిస్థితుల్లో ఉంది. తుఫాన్. నెత్తిమీద మరతుపాకులు. పడవలో ఉన్న మనుషులందరూ నిస్సహాయులే. ఒకరికొకరు సాయం చేసుకునే స్థితిలో లేరు. చెప్పడం మరిచేను. అది రాత్రి. కాళరాత్రి. అమావాస్య. కాటుకలాటి చీకటి.

చిట్టి : గుండె లదరగొడుతున్నావురా బాబ్జీ ! నీ సోది ఆపుతే కాసేపు ఆలోచనల్లో పడతాం.

బాబ్జి : పడొచ్చు. అందరగా కలిసి గోదార్లోనే పడతారు. మీ కిప్పుడు ఒక మహత్తరమైన వ్యక్తి ప్రత్యక్షమై మిమ్మల్ని రక్షించాలి. ఆ వ్యక్తి ఎవరు ? అన్నదే మీ ప్రశ్న ? ఉన్నాడు. ఆ వ్యక్తి ఉన్నాడు.

చిట్టి : ఎవరు ?

సుబ్బా : ఒరేయ్ శ్రీనివాసులూ ! బాబ్జీగారికి పిచ్చన్నవాళ్ళందరూ పిచ్చాళ్ళే. లేపోతే ఎంత తెలివిగా మాటాడుతున్నారో చూడు.

శ్రీను : నిజం. నిజం. ఇన్నాళ్ళా బాబ్జీగార్ని అపార్థం చేసుకున్నాం. ఈనాడు—

బాబ్జి : సైలన్స్. ఏవిటా కాకిగోల ? నే చెప్పే మాట వినండి. నే చెప్పిన మహత్తరమైన వ్యక్తి ఎవరో కాదు—నేను.

సుబ్బా : (నీరసంగా అన్నాడు) నువ్వా బాబ్జీ ?

శ్రీను : (ఎగతాళి చేశాడు) ఇంకా నయం, మీ హెడ్‌క్లార్కు అన్నావుకాదు.

చిట్టి : పోరా పిచ్చోడా ? నీ బిజినెస్ మా దగ్గర కాదు.

రాధ : చెప్పనివ్వండి.

బాబ్జి : మావయ్య కూతురు కామాక్షితో నాపెళ్ళి స్థిరపడింది. ఆషాఢమాసం నెల రోజులే అని చెప్పారు గనక ఆ నెలా గడిచిన వెంటనే మా పెళ్ళి. మా పెళ్ళవుతే—

చిట్టి : వూ .... పెళ్ళవుతే.

బాబ్జి : రాధమ్మకి నేను నాన్నని. నువ్వు నా అల్లుడివి. అర్థమైందా ? కానీ—

చిట్టి : (చల్లబడిపోయేడు) మధ్యలో కానీ ఏమిటి మావగారూ ?

బాబ్జి : ఉన్నదోయ్ లిటిగేషన్. కామాక్షికి చెవుడు. అదొక్కటే నాకు నచ్చనిది.

చిట్టి : ఏడ్చావులే మావగారూ ! చెవుడేం పెద్ద అవలక్షణం కాదు. పైగా—ఆడాళ్ళకు చెవుడుండటం మగాడికి మంచిది. చేసుకో. తొరగా చేసుకో.

బాబ్జి : చేసుకోను. మీ అందరికోసం నేనీ త్యాగం చేయలేను.

చిట్టి : ఇవి నీ చేతులు మావగారూ ! పట్టుకు బతిమాలుతున్నాను.

రాధ : మీ రుండండి. నిజానికి బాబూరావు నాన్నగారు చాలా మంచివారు. మీరే ఆయన్ని పాడుచేస్తున్నారు. నామాట నాన్నగారు కాదనరు.

బాబ్జి : అనలేను తల్లీ ! కానీ నే చేయబోయేది త్యాగమమ్మా త్యాగం.

చిట్టి : వల్లకాడు మావగారు ! వోరేయ్ బాబ్జీ నాకోసం రానీకు. పెళ్ళి చేసుకో! ఫర్లేదు.

బాబ్జి : చేసుకోన్నా—

చిట్టి : మరి నీ బిజినెస్సు ?

బాబ్జి : అఖిలాంధ్ర అప్పడాలు మరియు విస్తళ్ళ తయారీ సంస్థ ఉందిగా.

చిట్టి : అది వద్దురా. దానికంటే లాభదాయకమైంది యీ బిజినెస్సే !

బాబ్జి : ఏదీ లాభం. నేను పెళ్ళిచేసుకుని వో తండ్రి నవుతానని అరగంటనుంచీ చెబుతూంటే మీలో ఎవరైనా ఫీజుమాట ఎత్తేరా ?

శ్రీను : (నొచ్చుకున్నాడు) నా వంతు మాటవరహాల్లో గ్రాండ్ ఫాదర్‌కి.

సుబ్బా : తాతగారూ ! నేనూ అంతే ఇచ్చుకుంటానండి. మా అమ్మగార్ని దత్తత చేసుకోడానికి వప్పుకోండి.

బాబ్జి : మరి నువ్వోయ్ అల్లుడూ !

చిట్టి: నాదో అనుమానం! పీకనులు పెళ్ళంటూ—

బాబ్జి: ఆల్‌రైట్. నాకు పెళ్ళికాదనే నమ్మకం మీకుంటే అందరూ వెళ్ళిపోవచ్చు—నువ్వు మరో నాన్నని వెదుక్కో తల్లీ రాధ !

రాధ : (చిట్టిబాబుని మందలించింది) అబ్బబ్బ మీరు మరీను. నాన్నగారి మనస్సు నొప్పించకండి బాబూ!

చిట్టి : సరె. నేనూ మాటవరహాల్లో.

బాబ్జి : అయితే నేను మా కామాక్షిని పెళ్ళి చేసుకుంటాను. రా .... రాధమ్మా, మా యింటి వెల్తురువి నువ్వు. ఇలా రావోయ్ అల్లుడూ. మా యింటి వెలుగుని నీ చేతుల్లో పెడుతున్నాను. నెత్తినెట్టుకు పూజించు.

రాధ : నాన్నగారూ ! మీరెంత మంచివారండీ.

(పాదాభివందనం చేసింది. చిట్టిబాబుని కళ్ళతో హెచ్చరించి అతనిచేత గూడా చేయించింది.)

బాబ్జి : వెయ్యేళ్ళు ఆనందంగా వర్ధిల్లండి.

సుబ్బా : తాతయ్యా !

శ్రీను : బాబ్జీ తాతయ్యా !

(ఇద్దరూ బాబ్జీకి చెరోవేపు నించున్నారు.)

బాబ్జి : రెస్పాన్సు చూద్దామని కథల్లేను. మీరందరూ నా మనుషులేనని నన్ను ఆశ్రయించడం నాకు గొప్పగా ఉంది. నే పెట్టబోయే బిజినెస్సు ఇంత మనోహరంగా ప్రారంభమైందంటే నా కళ్ళు తిరుగుతున్నాయి. కానీ నాకా ఛాన్సు లేదు. నాకూ నాన్నగారు కావాలి. నిజం.

(ఆదివారం ఉదయం ఆ ఒక్క మాటతో నీరసాన్ని అలంకరించుకున్నది. అందరూ బాబ్జీవేపు హతాశులై చూసేరు.)

# కరుణ






కొండముది శ్రీరామచంద్రమూర్తి

### జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. కరుణ—ప్రసన్నలకు వివాహ మవుతుంది. మన్మథ కూడా పై చదువులు చదవటానికి నిశ్చయించుకుంటాడు. కరుణ, మన్మథ, వీరభద్రంలు ఎం. ఏ. లో చేరటానికి వాల్తేరు వెళ్ళారు. చివరికి ప్రొఫెసర్ నీలకంఠం ద్వారా సీటు సంపాదించగలుగుతాడు మన్మథ. ప్రసన్న ఉద్యోగ ప్రయత్నం సఫలమవుతుంది. సింగారి పట్టిన వీరభద్రాన్ని విడిపించటానికి మన్మథ చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. చలపతి నుంచి వేరుపడ్డ జమదగ్ని కుటుంబం విశ్వనాథం కోరికపై ఆయన ఇంట్లో ఉండటానికి అంగీకరిస్తారు.

## 22

వీరభద్రం కరుణను చూసి, జీడిమామిడి చెట్టు వెనుకకు తప్పుకుంటూ "కొంప మునిగింది బ్రదర్! నీ లవ్ ప్రక్కన ఉన్న ఆ ఎర్రమ్మాయి వరుసకు నాకు చెల్లెలవుతుంది. దగ్గర బంధువు కూడా! అంచేత మీరిద్దరూ వెళ్ళి అటకాయించండి. నేనిక్కడ ఉంటాను" అన్నాడు.

వాళ్ళ ప్రక్కన ఉన్న మూడో స్నేహితుడు నవ్వాడు. "వరస కలిసేవరకూ అందరూ చెల్లెళ్ళేరా భాయ్! డోన్ట్ వరీ! కమాన్, కమాన్" అని ప్రోత్సహించాడు.

"కాదులే. మీకు తెలీదు." వీరభద్రం చెట్టు ప్రక్కకు తప్పుకున్నాడు.

అతను తమ మాటలు విననంత దూరం వెళ్ళింతర్వాత, "కవర్డ్! పిరికి పంద." అన్నాడు. సింహాద్రి. మూడో స్నేహితుడు మెచ్చుకుంటున్నట్టు తల వూపాడు.

ముగ్గురాడవారూ, తోటదాటి వెళ్ళిపోతా రనగా, వాళ్ళను ఆ ఇద్దరూ అటకాయించడం జరిగింది. చేతులు అడ్డంగా చాపుతూ, కాలిబాటమీద వాళ్ళకు ఎదురుగ నిలబడి "ఇందాక అంటే సభ్యతకు జడిసి, మళ్ళీ కొట్టలేదు. ఇప్పు డెవరొస్తారు అడ్డం నీకు?" అన్నాడు సింహాద్రి అప్పలస్వామి, రజనివేపు కొరకొర చూస్తూ.

కరుణ ధైర్యంగా ముందుకు వచ్చింది. "నే నొస్తాను అడ్డం!" అన్నది.

"మనం సభ్యత, సంస్కారం కల మానవుల మన్న సంగతి మీరు మర్చిపోయారు. మీకు ఆవిధంగానే బుద్ధి చెప్పగలను. రండి" అన్నది మళ్ళీ.

"కరుణా! వాగాడంబరం వద్దు. నువ్వు ప్రక్కకు తొలగి నిలబడు. లేదా, నీ స్నేహితురాలికి పట్టిన గతే నీకూ పడుతుంది." సింహాద్రి హెచ్చరించాడు.

కరుణ ఉలిక్కిపడింది. ఒక్క లిప్తకాలం తన పేరు ఆ పరిచిత వ్యక్తికి ఎట్లా తెలిసిందా అన్న అనుమానంలో పడ్డది. ఆ అవకాశాన్నే అదనుగా తీసుకొని, అప్పలస్వామి రజని చెయ్యి పట్టుకు గుంజాడు. రజని వెన్నుస లరచింది. సబిత బలం కొద్దీ అతన్ని వెనుకకు నెట్టింది. కరుణ సంగతి గ్రహించి, సహాయపడబోయే టంతలో ఆ మూడో వ్యక్తి ఆమెను అటకాయించాడు.

సింహాద్రి రజని చెయ్యి పట్టుకుని తనవేపుకు లాక్కున్నాడు. ఆ చేతిని మోటుగా చుంబించాడు.

"ఇహ, పోదాం పదండి" అని వెనక్కు తిరిగాడు.

"ఎక్కడికి పోగలరు?"

వెనగ్గా వో కంఠం వినబడింది. ఆరడుగుల గంభీరమైన విగ్రహం కన్పించింది. తేరిపారజూస్తే మన్మథ! మన్మథను చూడగానే, అంతవరకూ ధైర్యం నటించిన కరుణ, వసివిల్లలా వెక్కిరు పెడుతూ "నిన్ను చిన్నాల్ని... వంటరివాళ్ళను చేసి..." అంటూ మాటలు రాక, స్నేహితురాళ్ళవంక చూపించింది.

మన్మథ వెనక్కి సింహాద్రి స్నేహితుని చొక్కా కాలరు పట్టుకుని, ఒకతగాట్టె అవతలకు నెట్టివేశాడు. సింహాద్రిని చొక్కా గుంజి నుంచి తనవేపుకు లాక్కొని, ఇతన్ని తెలియని వేగంలో, ఆవేశంతో అతని రెండు చెంపలూ వాయించేసి, "వెళ్ళు, వెళ్ళి, దిక్కున్నచోట చెప్పుకో! ఎందివాడి వనుకొన్నాను. ఇంతటి దగుల్బాజీ వనుకోంటే నీతో మాట్లాడకనే పోదును." అన్నాడు ఆయాసంతో రొప్పుతూ.

ఇంతలో ఆ మూడో వ్యక్తి దగ్గరకు రాబోయాడు. అది చూసి వీరభద్రం చెట్టు చాటునుండి పరుగెత్తుకు వచ్చి, అతనిమీద కలియబడి. "వద్దు. అతనిమీద చెయ్యి వెయ్యొద్దు." అన్నాడు కన్ను కలుపుతూ. ఆ మూడో వ్యక్తి అది గ్రహించినట్లుగా, అతని పట్టు విడిపించు





కొని, పారిపోయాడు. సింహాద్రి ఒంటరిగా మిగిలి, తల వంచుకుని, "ఐయామ్ వెరీ వెరీ సారీ!" అన్నాడు మన్మథవేపు చూస్తూ.

"నాకు కాదు. వాళ్లకు చెప్పుకో క్షమాపణ." అన్నాడు మన్మథ, ఇంకా కోపంతోనే.

సింహాద్రి మన్మథవేపు తలెత్తి దీనంగా, కోపంగా, జాలిగా చూశాడు. 'ఇది నీకు తగునా ?' అన్నట్లుగా ఉంది. ఆ చూపు. "ఊఁ ! తప్పదు." అని తొందర చేశాడు మన్మథ.

సింహాద్రి అప్పలస్వామి రజనివేపు తిరిగాడు. రెండు చేతులూ జోడించి నమస్కారం చేశాడు.

"నన్ను క్షమించండి. ఇంకెప్పుడూ మీ జోలికి రాను." అన్నాడు మెల్లిగా.

"మా జోలికే కాదు. ఇంకెవరి జోలికీ కూడా వెళ్లనని ప్రమాణం చెయ్." అన్నది కరుణ.

"అలాగే ! ఇంకెవరి జోలికీ వెళ్లను. భగవంతునిమీద ప్రమాణం చేసి చెబుతున్నాను."

సింహాద్రి తల వంచుకుని వెళ్లిపోయాడు. అతనిలో అవమానం కుతకుత మంటున్నది. ప్రతీకారం తీర్చుకోవాలన్న ధ్యాస పొగరాజు కుంటుంది. 'ఎట్లా ?' అన్నదే ప్రశ్న.

"యూనివర్శిటీ రిజిస్ట్రారు ఆఫీసు మీదుగా తిరిగి వెనక్కు వచ్చేస్తూ, అక్కడ తమకోసం నిలబడి ఎదురు చూస్తున్న మూడవ మిత్రునితో, "కుక్కతోక పట్టుకుని గోదావరి ఈదడం నాదే పొరబాటులే." అన్నాడు పరుషంగా.

ఆ స్నేహితుడు కొంచెం రూక్షస్వరముతో అన్నాడు. "వీరభద్రమే నన్ను వెళ్లిపొమ్మని సైగ చేశాడు."

"వాడొక ఇడియట్టు."

"కాదురా భాయ్ !" మన్మథ దగ్గరా మిగిలిన యిద్దరు, ముగ్గురు ఆడపిల్లల దగ్గరా, అభినందనాలు స్వీకరించి, "ఇంటి దాకా వెళ్దాం రండి" అన్న వాళ్ల అభ్యర్థనకు, "ఇప్పుడు కాదు. మరోసారి" అంటూ

వెనక్కి తిరిగి వచ్చేస్తూ సింహాద్రి మాట విని ఆవిధంగా వీరభద్రం జవాబిచ్చాడు.

"కాదు భాయ్ ! నేను ఇడియట్‌ని కాదు. ఆలోచించుకోకుండా మిమ్మల్ని అక్కడ, రంగస్థలంమీదనుంచి అవతలికి వెళ్లిపొమ్మని చెప్పలేదు. యూనివర్సిటీ ప్రొఫెసర్లు, మిగిలిన అమూం బాపతు జనమూ, సిరిపురం క్వార్టర్సు నుండి కాలేజీలకు వచ్చే అడ్డదారి. మనం ఏ ప్రొఫెసరు కంటబడ్డా మన ప్రోగ్రెస్, ఫ్యూచర్ అంతా మంట గలుస్తుంది."

"నాకు ఇహ క్రొత్తగా మంట కలిసే దేముంది ? యఫ్. ఎల్. ఇప్పటికి మూడు ఛాన్సులు పోయింది.." సింహాద్రి తనలో తను అనుకొంటున్నట్టుగా గొణిగాడు.

"ఏమైనా, మనం ఒకళ్ల కంట పడడం అంత మంచిదికాదు. రజనిమీద ప్రతీకారం తీర్చుకోవడం ...."

వీరభద్రంమాట పూర్తి చేయలేదు. సింహాద్రి అందుకున్నాడు. "రజనిమీద ప్రతీకారం తీర్చుకున్నాను. ఇప్పుడు మన్మథమీద ప్రతీకారం తీర్చుకోవాలి."

"అయితే దానికి ఇది కాదు మార్గం ?"

"మరేది ?"

"చెప్తానుగా !"

స్నేహితులు ముగ్గురూ మాట్లాడుకొంటూ నిల్చుండగానే సిటీ బస్సు వచ్చింది. ఎక్కేసి టర్నర్స్ చౌల్ట్రీ దగ్గర దిగేసి "హోటల్ ఫూటీ" వైపుకు నడిచి వెళ్లారు. వాళ్ల ఆలోచనల్లో రజని, కరుణ మన్మథ, సబిత, మెదులుతున్నారు. అందంగా ఉన్న అమ్మాయిలు ముగ్గురు .... ముగ్గురమ్మాయిలకూ అండగా, మొనగాడుగా మన్మథ.... మన్మథ మీద పళ్లు కొరికాడు సింహాద్రి అప్పలస్వామి.

"వాణ్ని యూనివర్సిటీలో చేర్పించింది నేను. ఎవరు ఎవరు ఏమిటేమిటో తెలియజెప్పిందీ నేను ! నాకే ఎసరు పెట్టాడు, రోగ్ !" పళ్లు నూరాడు అప్పలస్వామి.

అప్పలస్వామి తనను గురించి ఆలోచిస్తున్నట్టుగానే మన్మథ కూడా, అక్కడ ప్రొఫెసర్ నీలకంఠం ఇంట్లో, మధ్య హాల్లో కూచుని, కాఫీ సిప్ చేస్తూ, సింహాద్రిని గూర్చి ఆలోచిస్తున్నాడు. "ఈ వూళ్లో నాకు మొట్టమొదట కన్పించి, స్నేహం చేసినవాడు" అన్నాడు ఆలోచిస్తూ.

"అతను, నన్ను పేరుపెట్టి పిలిచాడు !' అన్నది కరుణ, "నాపే రెట్లా తెలిసిందో!" అంటూ ఆలోచనగా,

"వీరభద్రం అక్కడికి ఎట్లా వచ్చాడు. ఎక్కణ్నుంచి" అన్నది రజని అనుమానంగా. రజనికి, వీరభద్రం వాళ్ల వూళ్లోనే తెలుసు.

"మన్మథగారు ఎట్లా వచ్చారో, అట్లాగే !" అన్నది సబిత, బెనిఫిట్ ఆఫ్ డవుట్ అతనికి ఇస్తూ.

"నేను హాస్టలు రూం నుండి మీ ఇంటికి వచ్చి మీ రెవ్వరూ కనిపించక, మళ్లీ యూనివర్సిటీకి తిరిగి వచ్చేస్తున్నాను. దారిలో ఇది జరిగింది." అన్నాడు మన్మథ, తనను సమర్థించుకొంటున్నట్టుగా.

"అబ్బే ! పూరికేనే అన్నానండి. వీరభద్రం, మీ బంధువు, అక్కడికి ఆ సమయంలో రావడం నాకూ ఆశ్చర్యంగానే ఉన్నది." అన్నది సబిత.

వాళ్లు ముగ్గురూ కొంతసేపు ఆ విషయాలే తిరిగి తిరిగి మాట్లాడుకొన్నారు. "నాన్నగారితో చెప్పనా ఈ విషయం?" అని అడిగింది సబిత, మన్మథవైపు చూస్తూ.

"వద్దు. వద్దు. ఇప్పటికి క్షమాపణ చెప్పుకుని వెళ్లిపోయాడుగా ! మళ్లీ పాము గనుక తల ఎత్తితే అప్పుడూ దాన్ని చితక గొట్టడం !!" మన్మథ అందరి దగ్గరా సెలవు తీసుకుని బయలుదేరాడు. కరుణ అతనిని వీధిదాకా సాగనంపడానికి వచ్చింది. "బావా ! ఆయన దగ్గర్నుంచి ఏవన్నా ఉత్తరా లొస్తున్నాయా ?" అని అడిగింది, కొంత దూరం నడిచి ఆమాటా ఈ మాటా మాట్లాడి "ఇంటి దగ్గర సంగతులే తెలీవు. ఉత్తరాలే లేవు. అంతా అయోమయంగా ఉంది." అన్నాడు మన్మథ.

"రోజు విడిచి రోజు ఉత్తరం రాయమన్నా నాయన్న ! నామీద కోపగించుకున్నారో ఏమో !"

"వాడేగా, నిన్ను ప్రోత్సహించి పంపించింది. నీమీ దెందుకూ కోపం ?"

ఆ కోపం ఒకవేళ వస్తే, అది తనమీద అత్యంతమైన ప్రేమవలన, తను దగ్గర లేనందుకు, అని సిగ్గు మూలాన, చెప్పలేక పోయింది కరుణ. మెదలకుండా వూరుకుంది.

మన్మథ ముందుకు నడుస్తున్నవాడల్లా ఆగి, వెనక్కి వచ్చి కరుణకు దగ్గరగా నిలబడ్డాడు. కరుణ అతనివేపు వింతగా చూసింది. మన్మథ ఇబ్బందిగా అన్నాడు. "కరుణా ! ఒక విషయం అడుగుతాను నిజం చెబుతావా ?"

కరుణ అతని మొహంలోకి సూటిగా చూసింది. "ఆ సందేహం ఒకటి అసలు ఎందుకు వచ్చింది ?" అన్నది.

మన్మథ కరుణ నుండి మొహం ప్రక్కకు తిప్పుకున్నాడు. "నాకు మాయలూ, మర్మాలూ చేతకావు. అనుకొన్న దేమిటో, అన్నదాకా వూరుకోలేను. ఎన్నాళ్లనుంచో నన్ను వేధిస్తున్న ప్రశ్న ఇది."

"ఏమిటది ?"

"నన్నెందుకు నువ్వు తిరస్కరించావ్ ?" అడగదల్చుకొన్న ప్రశ్న అడిగేసి, తేలిగ్గా వూపిరి పీల్చుకొన్నాడు.

ఆశగా కరుణవైపు చూశాడు. కరుణ కొంచెంసేపు నిశ్శబ్దముగా వూరుకొంది. ఆలోచించుకొంది. చివరకు మెల్లగా అన్నది. "కొన్నింటికి ప్రశ్నలే కాని, సమాధానాలు ఉండవు బావా ! సమాధానం చెప్పకపోతే నీ హృదయం బాధపడుతోంది. గులాబీ నువ్వు ఏం చూసి ప్రేమిస్తున్నావ్ ? అని అడిగితే ఎట్లా సమాధానం చెప్పను ! రంగు అనా ? వాసనకోసమనా ? కాదు ఇంతకన్నా అతీంద్రియమైన సౌందర్యస్థితి ఏదో ఉన్నది. మానవుల మధ్యా, మానవుల మధ్యా అభిమానాలూ, ప్రేమలూ ఏర్పడ్డానికి కూడా కారణం అదే." కరుణ రెండు క్షణాలు వూరుకొంది. "నువ్వు నన్నొక ప్రశ్న వేశావ్ ? నేను నిన్నొక ప్రశ్న అడగనా బావా ?"

ఆలోచనలోంచి బయటపడ్డ మన్మథ సంతోషంగా అన్నాడు. "తప్పకుండా అడుగు"

"రజనిని నువ్వు పెళ్లి చేసుకోకూడదూ?"

"పెళ్లా!" మన్మథలో ఆశ్చర్యం పరాకాష్ట స్థితిని సంపాదించి "అసలు ఆ భావనే నాలో లేదు." అతని కళ్ల ముందు రజని ఒక్క లిప్తపాటు గోచరించింది.

"రజనికి నువ్వంటే ఎంతో అభిమానం బావా! ఈరోజున నువ్వు చేసిన పనితో అది ద్విగుణీకృతమైంది. ఆ చూపులు, నువ్వు మాట్లాడినప్పుడు నీవైపు చూడలేకపోవడం, ఆ మాటలు—నీ మాటలకు జవాబు చెప్పలేక పోవడం, రజని నీకు తగిన భార్య కాగలదని నా అభిప్రాయం."

"నాకు ప్రస్తుతానికి ఆ ఆలోచనే లేదు కరుణా! కలిగినప్పుడు, కరుణలాగా రజని కనిపించినప్పుడు తప్పకుండా పెళ్లి చేసుకుంటాను."

మన్మథ అక్కడినుండి వెళ్లిపోయాడు. వెళ్లిపోతున్న మన్మథవేపే చూస్తూ రోడ్డు మీదే నిలబడిపోయింది కరుణ, వెనగ్గా రజని వచ్చి తనపై చేయివేసి ప్రకృతంలోకి తీసుకుని వచ్చేవరకూ.

"ఏమిటక్కా, ఆలోచిస్తున్నావ్?" రజని గొంతు, తుంబురుని తంబురలా మ్రోగింది.

"నీగురించే చెల్లీ!" రజని పెద్ద కన్నులు మరింత విశాలములైనాయి.

"మన్మథ నిన్ను గురించి అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పలేక విసిగిపోయాననుకో."

"ఏమని అడిగారూ, ఆయన?"

"నువ్వు తనను గురించే ఎందుకు ఆలోచిస్తుంటావని అడిగారు."

"నేనేం ఆయనను గురించి ఆలోచించడం లేదు."

"పోనీ, నేను రజనిని గురించి ఆలోచించేట్లుగా, ఆ అమ్మాయి ఎందుకు అంత అందంగా ఉంటుందీ అని అడిగాడు."

"అది ఆయన తప్పు. అసలు ఆయన నావేపు ఎందుకు చూడాలి?"

"నన్ను పెళ్లి చేసుకుంటుందేమో

# కరుణ

కనుక్కో కరుణా, అన్నాడు."

"నే నసలు పెళ్లే చేసుకోను."

"పెళ్లయేంతవరకూ ప్రతి అమ్మాయి ఇట్లాగే అంటుంది. పెళ్లయిం తర్వాత, తనట్లా అన్నందుకు తనను చూసి తనే నవ్వుకొంటుంది." ఇద్దరూ మాట్లాడుకొంటూ రోడ్డుమీద కొంత దూరం నడిచారు. రజనిని గరల్స్ హాస్టల్ కు వెళ్లడానికి బస్సెక్కించి, ఆమె వెళ్లిపోయిం తర్వాత, తిరిగి తన గదికి చేరుకొన్నది కరుణ. ఆమె తలపులన్నీ ప్రసన్న చుట్టూ తారట్లాడుతున్నాయి. కాగితం, కలం తీసుకుని ఉత్తరం వ్రాయడానికి కూచున్నది. కొంతదూరం రాసేవరకు సబిత అక్కడకు వచ్చి, "అక్కా! అక్కా!! హిచ్ కాక్ పిక్చర్, 'బర్డ్స్' వచ్చింది. వెళ్దామా?" అన్నది. మళ్లీ, తనే, "హో! ఐయామ్ సారీ, డిస్టర్బ్ చేశానా? బావగారి కేమిటి ఉత్తరం అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?" అన్నది నవ్వుతూ.

"ఫర్వాలేదు. రా." ఉత్తరం పూర్తిచేసి, కవరులో పెడుతూ అన్నది కరుణ.

"అక్కా! నీ నోటిద్వారా ఆయన ఎంతటి విశాలహృదయుడో తెలుసుకోవడం తప్ప, ఒక్కసారి యిక్కడికి రమ్మనమని రాయరాదూ?"

"ఆ విషయమే రాశాను సబితా, ఇందులో!"

ఇద్దరు స్నేహితురాండ్రూ భోజనం చేయడానికి లోపలికి వెళ్లిపోయారు. బయటి గదిలో రేడియో హిందీ సంగీతం వినిపిస్తోంది. లైట్ హౌస్ మీది నుండి కాంతి రేఖలుగా చీలిపోతున్నది.

* * *

ప్రసన్న, ఇంగ్లీషు డిపార్టుమెంటులో 'జూనియర్ మోస్టు మెంబర్' కావడంచేత సీనియర్ లెక్చరర్లు అతన్ని తమ చిత్త మొచ్చినట్లు వాడుకోవడం మొదలు పెట్టారు. పైగా అతను ఆ కళాశాలలోనే పూర్వ విద్యార్థి కావడంచేత, అతనంటే మరీ చనువు ఏర్పడింది. వయస్సు పక్షి మార్గంలోకి మళ్లింది, బట్టతల ఉపన్యాసకులకు. అతను నిజానికి కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకొంటూ పోసుకోలు కూచో వలసిన వాడైనప్పటికీ, ఎవరు ఏరోజు సెలవు పెట్టినా వారి తరగతులకు అతనే పోవలసి వచ్చేది. బియ్యే ఫైనలియర్, ఎడ్వాన్స్ డ్ ఇంగ్లీషు తరగతుల దగ్గర నుంచి ప్రీ యూనివర్సిటీలో చిట్టచివ్వరి సెక్షను వరకూ అతనే పాఠాలు చెప్ప వలసి వచ్చింది. దీనికి తోడు ప్రిన్సిపాలు గారు అతను యువకుడనీ, ఉత్సాహవంతుడనీ, డ్రమెటిక్ అసోసియేషన్ కు ప్రెసిడెంటు అనీ, మేగజైన్ కమిటీ మెంబరనీ, ఇట్లాంటి అమూంబాపతు పదవులు కొన్ని అంటగట్టాడు. దీంతో కాలేజీలో ఉద్యోగము కూడా, మిగతా ఆఫీసుల్లో ఉద్యోగాలు మాదిరిగానే, యాంత్రికం అనిపించింది ప్రసన్నకు. ఊపిరి సలపని పని అయిపోయింది. ఉపన్యాసకులను పిలిపించి సభలూ, సమావేశాలూ ఏర్పాటు చేయించడం, ప్రతి ఎసోసియేషన్ సమావేశానికీ ఎంటర్ టెయిన్ మెంట్ ఉండేట్లు చూడడము, విద్యార్థుల దగ్గర్నుంచి 'ఆర్టికల్స్' అడిగి పుచ్చుకొని వాటిని ఓపికతో చదివి, దిద్ది, ఏమాత్రం బావున్నా కాలేజీ మేగజైన్ బోర్డుకు అప్పగించడం—ఇన్నింటి మధ్య కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకోవడం, వీటితో అతనికి నిద్రాహారాలు కరువైన పరిస్థితి ఏర్పడింది.

అయితే ఇందుమూలంగా లాభం కూడా లేకపోలేదు. అతను విద్యార్థుల్లో 'పాప్యులర్' అయ్యాడు. అప్పటినుండి విద్యార్థులు వచ్చి ట్యూషనులు చెప్పమని వేధించడం మొదలుపెట్టారు. "నేను డబ్బు తీసుకుని ట్యూషన్లు చెప్పను." అన్నాడు ప్రసన్న.

"మీరు మమ్మల్ని డబ్బు ఇయ్యమని అడిగితే అది తప్పు. వత్తిడిచేస్తే తప్పు. ఇది మా సంతోషంకొద్దీ మీకు ఇచ్చేది!—ఇందులో దోషంలేదు." అన్నారు కొందరు విద్యార్థులు.

బ్రదర్‌కేస్‌లో నిద్రపోతున్న ఫైల్ పిపు చరిచి, లేపి, చంక నెత్తుకొని, వాకిలిని బలంకొద్దీ తన్ని తన సామ్రాజ్యంలోంచి వెలుపలికి వచ్చాడు మాధవ్.

ఫైల్లోని సర్టిఫికేట్లు అన్నింటిని పరామర్శ చేసి, కరస్పర్శచేసి, కాళ్లకు పని చెప్పాడు.

మిట్ట మధ్యాహ్నం ఒంటిగంట. భూమిమ్మీంచి ఆరడుగుల మనిషి. ఎర్రగా బలంగా శరీరం, నొక్కుల జుత్తు, వెడల్పు నుదురు. తిన్నని ముక్కు అందమయిన ముఖం ఇరవైఏడేళ్లనాడు పుట్టినవాడు. బ్రహ్మచారి. లెక్కా జమా లేకుండా నడచి పోతున్నాడు.

నడిరోడ్డుమీద అడ్డంగా, నిద్రపోతున్న నల్లరాయిని లాగి ఎడంకాలుతో తన్నితే దొర్లుతూపోయి, మురుగు కాలవలో తల దాచుకొంది.

మాధవ్ కాళ్లు పని చేస్తున్నాయి.

ఎదురుగా రిక్షాలాంటి వస్తువు. అందులో మనిషిలాంటి పదార్థం. పదార్థంలో దొంగచూపు. ఆ చూపు పరిచయమే!

చిరపరిచితమయిన చూపూ ముఖమూ చూడబోతే రిక్షా దాటిపోయింది. మెడ ఏటవాలుగావంచి వెనక్కుచూస్తే, పెడవాటంగాపెట్టి రిక్షాలోంచి వెనక్కుచూస్తున్న ఆ పదార్థం తాలూకు తలకాయ అనబడే చీకటిలోంచి రెండు విద్యుద్దీపాల వెలుతురు పడి మాధవ్ ముఖం వెలిగిపోయింది.

కాంతితో, కమిలిపోయిన ముఖం కాంతి పోయిం తరవాత కందగడ్డ అయింది. వళ్లూ, కళ్లూ చెక్కిళ్లూ అదిరిపోయాయి.

పోయింది విలన్‌కాదు. ప్రభావతి! శూర్పణఖకాదు. సుందరి! సన్నగా ఎర్రగా ఎత్తుగా వుండే ఆమె వంగికూర్చుంటే ముచ్చటగా వుంది. కళ్లలో కాంతి సెలయేళ్లన్నాయి.

మాధవ్, ప్రభావతి—వీళ్ల పరిచయం అకస్మాత్తుగా అయిందికాదు. ఆరేళ్లనాటిది. ఆరోజుల్లో, వాళ్లు ఫైనల్ ఎం. ఏ. లో క్లాసుమేట్స్! అప్పటిలో ఆమె కళ్లతో పిలిచేది. మాధవ్ శరీరంతో పలికేవాడు.

ప్రభావతి సెకెండ్ క్లాసులో పాసయింది. మాధవ్ ఫస్ట్‌క్లాస్. యూనివర్శిటీ ఫస్ట్. అంతేకాదు. ఇరవై సంవత్సరాల హైయ్యెస్ట్ మార్క్సు రికార్డును — హిజ్ మాష్టర్స్ వాయిస్ రికార్డులాగా చాచి నేలమీదవేసి పగలకొట్టి సెబాష్ అనిపించుకొన్నాడు. అంతటితో వాళ్ల పరిచయం అంతంకాలేదు.

పరీక్ష పాసయినరోజే ఆమె తండ్రిదగ్గరకు పెళ్లిగొంలాలగా వెళ్లాడు.

'మీ అమ్మాయిని పెళ్లాడతా' నని చెప్పాడు.

'తరవాత చెబుతా' రిప్లై పెళ్లిగొం ఇచ్చాడు పిల్లతండ్రి. 'మీ తల్లీ దండ్రీ పోయారుకాదా! లాభంలేదు!' తరవాత చెప్పాడు.

తందామనుకొన్నాడు మాధవ్. దాంతో కథ తారుమారవుతుందని వూరుకొన్నాడు.

పూర్తిగా వూరుకోలేదు. ఆ వూరి ఆడవాళ్ల కాలేజీలో అడలెక్చరరుగా చేరిన ఆడమనిషి ప్రభావతిని ఆగమన్నాడు. ఆగింది.

'ఏంటండీ!' అంది.

'ఏమన్నా అడుగుదామని' అన్నాడు.

'ఏమడుగుతారు?'

'పెళ్లి సంగతి!'

'ఎవరిపెళ్లి?'

'నా పెళ్లి—నీ పెళ్లి—మన పెళ్లి!'

'అంటే?'

'నన్ను పెళ్లి చేసుకొంటారా లేదా?'

'ఊఁ!'

'మరి ఆలస్యం?'

'ఉద్యోగం సంపాదించుకోండి'

ఆమె వెళ్లిపోయింది. మాధవ్ వళ్లు మండిపోయింది.

ఆడవాళ్లే చేస్తున్న లెక్చరరు ఉద్యోగం అతని కక్కరలేదు. రిసర్చిలో చేరదామనిపోతే తరిమేశాడు ప్రొఫెసర్.

ముందునుంచి వస్తున్న లారీ కిర్రుమంటు ఆగింది. వెనక కారు బర్రుమంటూ ఆగింది. రెంటికీ చెడ్డ రేవడిలాగా రెండింటికీమధ్య భజన చేస్తున్న మాధవ్‌ని ఎవరో భజన పరులు పక్కకు లాగారు.

'బ్రతికిపోయావ్ ఫో' అన్నా రెవరో.

'బ్రతికిపోయారు పొండి' అనుకొన్నాడు మాధవ్. రెండు యంత్రాల వెహికల్సనీ, యంత్రాల్లాంటి మనుష్యుల్నీ చూస్తూ.

తారురోడ్డుమీద తనదే ఈ రోడ్డంతా అన్నట్లుగా నడుస్తున్నాడు మాధవ్.

ఐ. ఏ. యస్. అతన్నే తన్నిందో, అతనే ఐ. ఏ. యస్‌ని తన్నాడో చెప్పటం అసాధ్యమే!

ఎందుకంటే, మాధవ్ యధాశక్తి పరీక్షలు వ్రాశాడు. యధా వోపికతో పేపర్లు పాసయ్యాడని ప్రకటించాయి.

అంతటితో అయిపోలేదు. ఆపైనే తద్దినం. తద్దినపు ఇంటర్వ్యూలో శక్తికిమించి సమాధానాలు చెప్పాడు. శక్తికిమించి సర్వీస్ కమీషన్ వాళ్లు సెలెక్ట్ చేయలేకపోయారు.

రెండుసార్లు పరీక్షలకు పంగనామాలు పెట్టాడు. రెండుసార్లూ ఇంటర్వ్యూ ఏగనామం చుట్టింది.

ఉన్నటుండి మూడేళ్లు మూతి ముడుచుకొన్నాయి. ఉద్యోగంలేదు. వచ్చే అవకాశం లేదు. కోరిన ఉద్యోగం వస్తుందనే ఆశ లేదు. అవకాశంతోపాటు వయస్సూ దాటిపోయింది.

కడచిన మూడేళ్లలో ఎన్నో ప్రకటనలు చూశాడు. ఎన్నో ఉద్యోగాలకు దరఖాస్తు—వళ్లు ఫలాలతో—సైడ్ బిజినెస్‌గా సమర్పించుకొన్నాడు.

ప్రయోజనం?

శూన్యంకాదు. ఇంటర్వ్యూలు వచ్చాయి. వెళ్లాడు. ఫైలు చూపాడు.

ప్రయోజనం?

శూన్యంకాదు. ఉద్యోగం రాలేదు. అంతే!

ఏదో ప్రత్యేకత మాధవ్ సొత్తు. విశిష్టత హక్కు. అవి ఆదరణ పొందలేక పోయాయి. పోతేపోయాయి అని కాళ్లు ముడుచుక్కూర్చోలేదు మాధవ్!

ఆమధ్య అతని జ్ఞాననేత్రం చులాగ్గా విచ్చుకొంది. దాంతో తూర్పు తూర్పుకాదనీ, మరేదోనని—ఇలాంటివే చాలా కొత్త సంగతులు తెలుసుకొన్నాడు.

నవ్వుతూ కనిపించే అందరూ నవ్వటం లేదనీ, ఏడుస్తున్న అందరూ ఏడవటం లేదనీ, తెలిసి ఆశ్చర్యపడి, లేచి పరుగుతీశాడు. మనుష్యులకు దూరంగా పారిపోవాలని. పిలుకాక కుప్పగా కలిపోయి, నేల

మీాదపడి - దెబ్బ తగిలితే - అపురూపమని పిస్తాడు.

మాధవ్ ఎప్పుడూ క్లాసుల్లోవుండే వందల్లో ఒకడుకాడు. అంతేకాదు. లోకంలోని వేలలోనూ ఒకడుకాడు. వాడు వేరేవాడు. ఏనాటికీ మాధవ్ వలు గురుకంటే భిన్నమైనవాడు.

ప్రత్యేకత గుర్తించుకొన్న రోజుల్లో అయిదు వందల జీతంలేని ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టలేదు. జ్ఞానన్త్రం 'విప్పు కొన్నతర్వాత మూడువందలకే అలవంచాడు. ఆమధ్య కిందచూపు వచ్చింది.

'హల్లో మాధవ్' జీపులోంచి పిలుపు!

నడిరోడ్డుమీాద జీపు పక్కగా ఆగాడు మాధవ్.

'ఏం చేస్తున్నావురా?'

'రోడ్లమీాద తిరుగుతున్నాను'

'ఏడిశావులే! అవేంటి?'

'సర్టిఫికేట్లు!'

'ఎక్కడికి పోతున్నావ్?'

'తగలెయ్యటానికి?'

'అవేం మాటలురా!'

'అంతేలేరా!'

జీపులో గొంతు డిప్యూటీ కలెక్టరు. మాధవ్ క్లాసుమేటు! మూడో థర్డ్‌క్లాసుతో నిక్కీ నీలిగి ఒడ్డునపడి ఎం. ఏ. అనిపించుకొన్న బాపతు. అకస్మికంగా అపరశూర్పణఖను పెళ్లాడాడు. ఆ ఆనందంతో మామ గారు మహనీయుడు ఆకాశం అంత ఎత్తు

# మలుపు తిరిగింది

పెరిగిపోయాడు. దెబ్బతో దేవలోకంలోంచి ఆ ఉద్యోగం వూడిపడింది.

మాధవ్‌ముఖంలో నిప్పు కణికలు తైతక్కలాడాయి. ఎటూ చూడకుండా నడుస్తున్నాడు. ప్రభావతి గుండెలో వెంటబడి వస్తూవుంది.

'మాధవ్! లెక్చరర్ పోస్ట్ ఎడ్వర్టైజ్ అయింది.'

'చూశాను!'

'అప్లై చేస్తావా?'

'చేయాలా?'

'చేయండి!'

'చేయను!'

'ప్లీజ్!'

'నో!'

ప్రభావతి ముఖంలో నెత్తురుచుక్క ఉందో లేదోకాని మాధవ్‌కి కనిపించలేదు. కన్నీరుంది. కనిపించింది. నెత్తురుచుక్క అయితే తుడిచేవాడేకాని, కన్నీటిజోలికిపోయేందుకు చేతులాడలేదు.

'అంతేనా?' అడిగింది.

'అంతే!'

ఆమె సన్నటి శరీరాన్ని బరువుగా ఈడ్చుకొంటూ వెళ్లింది. ఆకాశంలోనో, శరీరంలోనో మెరుపు మెరిసిందనీ, ఉరుం ఉరిమిందనీ అనుకొన్నాడారోజు.

ఆమె మాటలు వింటే మాధవ్ తలకి జ్వరం వచ్చింది. శరీరానికి తిక్కఎక్కింది.

'లెక్చరరుగా చేరాలి. పెళ్లి చేసుకోవాలి. సంచి కొనుక్కోవాలి. మార్కెట్టుకి పోవాలి. కూరగాయలు తేవాలి.' అనుకొంటే వళ్లు వణికిపోయింది.

ప్రభావతి తల్లిదండ్రుల చాటు బిడ్డ. మాధవ్‌ను మనసారా కోరుతున్న యువతి. ఉద్యోగం చేస్తున్న స్త్రీ. కుటుంబం పోషించే మగవాడు. పెళ్లాడవలసిన పసిపిల్ల!

మాధవ్ ఏకాకి! చదువు, తెలివి రేటు లున్నవాడు. లోకం తెలియని నెత్రిబాగులవాడు. పెళ్లికోర్కె, ఉద్యోగం ఆశ, ఉద్యోగానికీ, ప్రభావతికీ పెళ్లి చేయాలనే తలంపూ ఉన్నవాడు.

రావలసిన ఉద్యోగాలు రాలేదు. చేసుకోవలసిన పెళ్లి చేసుకోలేదు.

ఎవరూలేక ఒంటరితనంతో చాలా క్రుంగి, ఎత్తు తగ్గిపోయాడు. చెప్పే వాళ్ళులేక పట్టుదల పిచ్చిగా తయారయింది.

తారురోడ్డుమీాద నడుస్తున్న మాధవ్ కళ్లలోంచి నీటి బిందువులు జారి చొక్కామీాదపడి, బనీనులోకి ఇంకి గుండెమీాదికి జారిపోతే గుండెల్లో వున్న ప్రభావతికి చలి పుట్టింది.

కోపం ఎక్కువయింది. చేతులూ కాళ్ళూ బిగుసుకుపోయాయి. చేతిలో ఫైల్ గాలికి పక్షిలా ఎగిరి, రాయిలా క్రిందపడింది. సర్టిఫికేట్లు, అప్లికేషన్ ఫారాలు, పేపర్ కట్టింగులు, ఇంటర్వ్యూ కార్డులు, కార్బన్ కాగితాలు, గుండుసూదులు, టేగ్‌లు అన్ని చిందర వందరగా క్రిందపడ్డాయి.

ఎడా పెడాతీసి అడ్డదిడ్డంగా ఫైల్లో కుక్కుకొని, చాచి చాచి అంగలువేస్తూ నడుస్తున్నాడు. గత జీవితం కళ్లముందు రోడ్డు మీాద నడచిపోతూవుంది.

పోయిన రెండేళ్లలో అప్లై చేసిన ఉద్యోగాలు— తిగలాడితే డొంకంతా కదిలినట్టే!

ఒక ఎగ్జిక్యూటివ్ సర్వీస్‌లో, ఉద్యోగానికి— ఆరువందలనుంచి రెండువేలుదాకా నెలజీతం—అప్లై చేయటానికి భయం వేయకపోలేదు.

అప్లై చేసి, టెస్టులన్నీ సంతృప్తి,



కరంగా పూర్తిచేసి ఉద్యోగం నూటికి నూరు పాళ్లు వస్తుందని నమ్మి, ఎదురు చూడటంలోనే కాలంహరించుకుపోయింది.

అయిదు సంవత్సరాల కాలం పోతూ పోతూ మాధవ్ ఆస్తినంతా ఆరగించి పోయింది.

దినపత్రికల్లో ప్రకటనలు చూచి చూచి విసిగిపోయి, తను దినపత్రికలో చేసే ప్రకటనకు నాలుగురోజుల నాడు పర్సులో ఉన్న మొత్తం పోగా మిగిలిన రూపాయి పావలాతో నాలుగురోజులు నావి అనిపించుకొని, పావలా మిగుల్చుకొన్నాడు.

ఇంకా పావలా పర్సు స్వామ్రాజ్యంలో ఏక్‌దిన్‌కా సుల్తాన్ లాగా సింహాసనం మీద కూర్చుని అట్టహాసం చేస్తూవుంది.

కడుపులో ఎలుకల గొడవను 'నోర్మూయ్' మని నోరుమూసుకొని తనగదిలో కూర్చున్న ఫస్ట్‌క్లాస్, యూనివర్సిటీ ఫస్ట్, ట్వంటీ—ఇయర్స్ రికార్డ్ బ్రేక్ చేసిన బ్రిలియంట్ ఎకనామిక్స్ స్టూడెంట్ దగ్గరకు ఎకనామిక్స్ లెక్చరర్ మిస్ ప్రభావతి లెక్కప్రకారం నడచివచ్చింది.

'ఏం?' అన్నాడు. నిజంగా అనాలనుకొన్నాడు. తీరా అన్నాననుకొన్నాడు. అయితే అది ఆమెకు వినిపించలేదు.

'మాట్లాడరేం?'

## మలుపు తిరిగింది

'ఊఁ!' అన్నాడు. మూలిగాడని, జబ్బు చేసిందేమోనని తలంచింది.

'మీ ఆరోగ్యం ఎలావుంది?'

'బాగుంది!'

'అలా వున్నారేం?'

'బాగానే వున్నాను— అదిసరేలే!—ఇలా వచ్చిందెందుకు'.....

'మీతో ఒకమాట చెప్పాలని........'

'ఏమిటి? పెళ్లిమాటా?'

ప్రభావతి మెలికలు తిరిగింది. ఆ మెలికలు పట్టుకొని అవతల పారేద్దామనుకొన్నాడు. అయితే ఓపికలేదు.

'నిన్ను పెళ్లాడే ఓపికా, అవకాశం నాకు లేదు. క్షమించు.

తల్లిదండ్రులు లేకపోవటమే ఒక అనర్హత అయినప్పుడు, ఆస్తిపాస్తులు ఉద్యోగం లేనప్పుడిక వ్యవహారం—వల్ల కాదే!

'మీరు ఉద్యోగం చేయక పోయినా ఫరవాలేదు.' అని ఆమె చెప్పిందో లేదో, 'పెళ్లికష్టాన్నుంచి' అని కసురుకొని, దుప్పటి కప్పుకొని, మునగర దీసుకొని—ఆమెబాధగా వెళ్లిపోయింది— బావురుమని ఏడ్చాడు.

మాధవ్ నడుస్తున్నాడు. కాలికి రాయి తగిలింది. చుట్టూ చూశాడు. కిళ్లీషాపులో దినపత్రిక వుంది. పేపరు తీసుకొని తన ప్రకటన చూశాడు. కళ్లలోంచి నీళ్లు జారాయి. అగ్గిపెట్టె తీసుకొన్నాడు. పావలా ఇచ్చాడు. చిల్లర తీసుకోలేదు.

పర్సు విశిష్టాద్వైతం బోధించింది. మురుగు కాలవలోకి విసిరాడు.

తిన్నగా ప్లేగ్రౌండ్ లోకి—తోవలేక పోయినా, పల్లేరుగాయల్లోంచి, నొప్పి తెలియకుండా కాళ్లు నడిచాయి.

సర్టిఫికేట్‌లకూ ఉద్యోగాలకూ ఋణానుబంధం, పదవివల్ల గౌరవం గలభావన్తాయి. వ్యక్తిత్వం లేని వాళ్లకు ఉద్యోగం ఒక వ్యక్తిత్వం, ఉద్యోగం లేకపోయినా ధనసంపాదనా, బ్రతుకుదెరువూ దుర్లభం కాదు. మనిషి ఏపని చేసినా వాడి నిజమైన వ్యక్తిత్వం ఏమిటో అదే మిగులుతుంది. తక్కిందంతా నటనా, మోసం.

అనుకొన్నాడు. ఫైల్ దభీమని నేల మీద పడేశాడు.

యస్. యస్. యల్. సి. పైకి తీశాడు. స్కూలుమాష్టర్ల ఆదరణ— నాన్నప్రేమ —మిత్రుల స్నేహం— స్కూలుజీవితం అంతా కళ్లముందు కదిలింది. నీళ్లు తిరిగాయి.

అగ్గిపెట్టె తీసి గీశాడు. యస్. యస్. యల్. సి.కి ముట్టించాడు. కళ్ల నీళ్లు కాలుతున్న కాగితాలుమీద పడ్డాయి. మంట గలిశాయి.

ఎం. ఏ. డిగ్రీ పుచ్చుకొన్నాడు. యూనివర్సిటీ కనబడింది. సంఘటనలూ జ్ఞాపకాలూ బ్లేడ్ కోతల్లాగా మెత్తగా తెగుతున్నాయి.

ప్రభావతి కళ్లు వళ్లంతా హాసం చేస్తున్నాయి. చదువూ—ప్రభావతీ పోటీపడి పరుగు పందెం! చదువు ముందు పడింది. ఆమె ఓడిపోయింది.

అగ్గిపుల్ల గీశాడు. ఎం. ఏ. డిగ్రీ కాలి పోయింది. ఇంక ఫైల్‌కే నిప్పు ముట్టించాడు. సీత అగ్ని పరీక్షగుర్తుకు



వచ్చింది. మంటలు నాల్కలు సాగుతున్నాయి. మంటల్లో ప్రభావతి కాంతి మంతంగా వెలుగుతూవుంది.

నేలమీద దినపత్రిక పడివుంది శవం లాగా. దాని శిరస్సు పట్టుకొని పైకి తీసి ప్రకటన చదివాడు.

'.......... మధ్యాహ్నం రెండు గంటలకు, ప్లేగ్రౌండ్‌లో............ ఈ పరిస్థితుల్లో........ ఈ కారణాల చేత.... నాసర్టిఫికేట్‌లన్నీ కాలుస్తున్నాను.........'

దాన్నీ మంటలో పడేశాడు. శవసంస్కారం పూర్తయింది.

కళ్లలోంచి నీళ్లు— ముక్కులోంచి రక్తంజారినట్లు—జారి మంటల్లో పడ్డాయి.

అప్పుడు కళ్లు మసక మసకగా కనిపించాయి. ఏదో కదలిక చూశాడు. అంతకు ముందేమీ కనిపించలేదు. కళ్లు తుడుచుకొన్నాడు. చూశాడు. ఎదురుగా మనుష్యులు ఏమో మాట్లాడు తున్నట్లు నోళ్లు కదులుతున్నాయి. మాటలు వినిపించటం లేదు.

మాధవ్ నీరసంగా కూర్చున్నాడు.

ప్లేగ్రౌండ్ పక్క రిక్షాదిగి, యువతి —ప్రభావతి— పడుతూ లేస్తూవుంది.

మాధవ్ చూశాడు.

వచ్చింది. పక్కనే కూర్చుంది. మంటలు చూచింది. 'ఎంతపని చేశారు' అంది. ఏడ్చింది. మాధవ్ కన్నీరు తుడిచింది.

చుట్టూ చూచింది. 'రండి' అంది. కళ్లు ఒత్తుకొని లేచింది. పసివాడులా నిలబడ్డాడు మాధవ్.

చేయి పట్టుకొని ప్లేగ్రౌండ్‌కడ్డంగా జనాన్ని తప్పుకొంటూ మాధవ్‌ను తీసుకు పోతూవుంది ప్రభావతి.

ఎదురుగా– పోస్టుమేన్!

కవరు ఇచ్చాడు.

మాధవ్ చించి, చదివాడు. చెప్పాడు.

ఏదో కంపెనీ నుంచి—'నెలరోజుల్లో, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా... సర్టిఫికేట్‌లన్నీ చూపించి చేరాలి'. ●

**మేషం:** ఈ సంవత్సరం ప్రారంభంలో అన్ని వ్యవహారాలూ అనుకూలంగానే ఉంటాయి గాని, తరువాత క్రమంగా వ్యతిరేక పరిస్థితులు యేర్పడతాయి. వ్యాపారంలో మీకు మున్ముందు లాభించగల మార్పులు వస్తాయి. సంవత్సర ప్రారంభంలో చేసే దూర ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించడంవలన, మీా శక్తి సామర్థ్యాలను రుజువు చేసుకోనగలరు. వ్యాపారం భారీయెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వచ్చినా అవసరానికి ఏదో విధంగా డబ్బు అందగల సూచనలు ఉన్నాయి. జూలై నెల తరువాత అన్ని వ్యవహారాల్లోనూ జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం. భారీ వ్యవహారాలు ప్రారంభించడానికి యిది సమయంకాదు. జనవరి నెల నుంచి మరల మంచి పరిస్థితులు యేర్పడగలవు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో చికాకులు రావచ్చును. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పిస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. అలంకార వస్తువులు కొంటారు. విలాసయాత్రలు చేస్తారు.

**మిథునం:** ఈసంవత్సరం సామాన్యంగాఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని, అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మీకు లేని ఆశలు కల్పించి తాము ఆనందించడానికి ప్రయత్నిస్తారు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి యిది సమయం కాదు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం యిదివరకటి కంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును గాని, అందువల్ల ఏ కార్యక్రమమూ ఆగిపోదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి సంవత్సరాంతంలో బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో మీ ప్రయత్నాలకు మీ బంధువులే ఆటంకంగా వ్యవహరిస్తారు. శుభముహూర్తంగా వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో కొంచెం కార్యభారం పెరుగుతుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. ఎవరితోనూ వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు.

**సింహం:** అన్ని వ్యవహారాలూ అనుకూలంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని, మీరు ఏమాత్రం ఏమరుపాటుగా ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో ప్రయాస మీద ప్రయోజనం మందకొరిది కాగల పరిస్థితి ఏర్పడుతుంది. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే, భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యవహారాల్లో సమయానికి కొంతమంది ప్రముఖుల అండదండలు లభిస్తాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. మీ తాలూకు వస్తువులుగాని, ముఖ్యమైన కాగితాలు గాని పోయే ప్రమాదం ఉంది. వ్యాపారం భారీయెత్తున చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. రక్త సంబంధమైన అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. శుభకార్యాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి.

# సంవత్సర ఫలితాలు...

**వృషభం:** గ్రహబలం అనుకూలంగా ఉంది. ఇంతవరకు కేవలం ఆశయాలుగా మీ వ్యూహాపథంలో ఉన్న విషయాలు యిప్పుడు కార్యరూపాన్ని ధరించగలవు. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో యిదివరకు ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే, మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాకరంగా ఉంటాయి. ఇదివరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు యిప్పుడు చేతికి రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సంవత్సరం ఆఖరులో ఆకస్మికంగా కొన్ని చికాకులు ఏర్పడడం వలన ఆందోళన కలుగుతుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగానే ఉన్నా శ్రమతో కూడిన పనులకు పూనుకోవడం తగదు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. కొంతమంది బంధువులు తమ స్వార్థం కోసం మీకు అపకారం చేయడానికి ప్రయత్నిస్తారు. సంతానానికి అనారోగ్యం చేయువచ్చును.

స్త్రీలకు—సంవత్సరం మధ్యలో ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. బంధువర్గంలో గౌరవం బాగా ఉంది.

**కర్కాటకం:** అప్పుడప్పుడు కొన్ని చికాకులుకలిగినా మొత్తంమీద యీ సంవత్సరం బాగానే ఉంటుంది. వృత్తిలో మీకు నష్టం కలిగించడానికి కొంతమంది పోటీదారులు చేసే ప్రయత్నాలు మీకు అనుకూలంగా పరిణమిస్తాయి. వ్యాపారంలో యిదివరకు ఏవో కారణాలవలన ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తి చేయగలరు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో అధికారులు మీ యెడల అనుకూలంగానే ఉన్నా, యితరుల జోక్యం వలన ఆలస్యం కావచ్చును. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడంవలన మున్ముందు యిబ్బందికి గురి కాగలరు. కోర్టు వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్తడం వలన ఆందోళన కలుగుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. తీర్థయాత్రలు చేస్తారు.

---

పరాభవ

23—3—66 బుధవారం మొదలు

9—4—67 ఆదివారం వరకు

---

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. సంతానికి అనారోగ్యం చేయవచ్చును. బంధువులకు సహాయం చేస్తారు. కళాకారిణులకు మంచి సమయం.

**కన్య:** కొన్ని వ్యవహారాల్లో మీరు భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని వ్యవహరించడం వలన వృత్తి వ్యాపారాల్లో ప్రస్తుతం మీరు పొందవలసినంత ప్రయోజనాన్ని పొందలేక పోవచ్చును. వృత్తిరీత్యా దూర ప్రయాణాలు చేసి కార్యసాధన చేయగలరు. వ్యాపారంలో నూతనావకాశాలు లభించడం వలన ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అప్పుడప్పుడు లాభించగలవు. ఉద్యోగంలో కొంచెం కార్యభారం పెరిగినా, మీకు మున్ముందు లాభించగల మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడడంవలన మీా అభివృద్ధి మార్గం నిష్కంటకం కాగలదు. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో చికాకులు వచ్చి సర్దుకొంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్తడంవలన

ఆందోళన కలుగుతుంది. దూర ప్రయాణాలు చేస్తారు. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది.

**తుల:** ఈ సంవత్సరం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. "దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి." అన్నట్లు భవిష్యత్తులో మీకు ఉపయోగించగల కార్యక్రమాన్ని ప్రారంభించవలసిన సమయం. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. మీరు యిదివరకు జరిపిన వ్యవహారాల వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది గాని, సమయానికి ఏదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్చబడగలరు. సాంఘిక కార్యక్రమాల్లో మీకు ముమ్ముందు ఉపయోగించగల వ్యక్తులను కల్సుకొంటారు. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. విలాస వస్తువులు కొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా, నిర్లక్ష్యం చేయడం తగదు. కుటుంబ వ్యవహారాల్లో కొంతమంది బంధువుల జోక్యం వలన చికాకులు వస్తాయి. తీర్థయాత్రలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

## 'పరాభవ'లో మీ గ్రహబలం!

**వృశ్చికం:** వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు వ్యయప్రయాసలకు గురియైనా, తగిన ప్రతిఫలం లభించడంవలన యీ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడంవలన అధికాదాయంతోబాటు పోటీవారిలో గౌరవం కూడా లభిస్తుంది. వృత్తిలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. నూతనావకాశాల కోసం చేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో స్థానచలనం కలిగినా, మారబోయే స్థానం కూడా మీకు అనుకూలమైనదే కాగలదు. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి గాని, మొగమాటాలకు లొంగిపోయే ప్రమాదం ఉంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం తగదు. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. ఇదివరకు మీవలన ఉపకారం పొందిన బంధువులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని, మానసికాందోళన కలుగుతుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దూర ప్రయాణాలు చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు:** ఈసంవత్సరం సాధారణంగా ఉంటుంది. పూర్తిగా నెరవేరే వరకూ ఏ వ్యవహారాన్నీ నమ్మడానికి అవకాశంలేదు కాబట్టి వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన ఫలితంతో సంతృప్తి పొందడం మంచిది. వృత్తిలో మీ పరిస్థితి సంవత్సరాంతంలో బాగా ఉంటుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలకు తరుచుగా ఆటంకాలు వస్తాయి. భారీయెత్తున చేసే వ్యాపారాల్లో కొన్ని అవకాశాలు కన్పిస్తాయి గాని వాటివల్ల ప్రయోజనం కంటే ప్రయాస అధికంగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు మొత్తంమీద బాగానే ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో యితరులు చేసిన పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించవలసి వస్తుంది. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేస్తుంది. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—తరుచుగా స్వల్ప అనారోగ్యం చేస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో కొంచెం శ్రమ కలిగినా అన్ని కార్యక్రమాలూ అనుకొన్నట్లుగా నెరవేరతాయి. శుభకార్యాల విషయంలో మీ కృషి ఫలిస్తుంది.

**మకరం:** వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు అనుకోని వ్యయప్రయాసలకు గురియైనా, తగిన ప్రతిఫలం లభించగలదు. వ్యాపారంలో కార్యసాధన కోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా వ్యవహరించవలసిన వస్తుంది. వృత్తిరీత్యా దూర ప్రయాణాలు చేసి కార్యసాధన చేయగలరు. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మీ అభివృద్ధిని సహించలేక పని గట్టుకొని మీమీద దుష్ప్రచారం చేసే ప్రమాదం ఉంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి. ఇదివరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు యిప్పుడు చేతికి వస్తుంది. ఉద్యోగంలో ఉన్నతస్థానం కోసం చేసే ప్రయత్నాల్లో అధికారుల సహకారం లభిస్తుంది. ఇతరులకు ఉపకారం చేయడానికి ప్రయత్నించడంవలన మీరే శ్రమకు గురి కాగలరు. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరగడంవలన తీరిక లభించదు. నూతన విషయాలను తెల్సుకొంటారు. తీర్థయాత్రలు చేస్తారు. పోటీవారితో మాట పట్టింపులకు దిగడం మంచిదికాదు.

**కుంభం:** ఈ సంవత్సరం సామాన్యంగాఉంటుంది. ప్రయత్నించిన ప్రతి పని నెరవేరుతున్నట్లే కన్పిస్తుంది. కాని, ఫలితం మాత్రం చేతికి అందదు. మీ ఆలోచనలు మీ స్వంత వ్యవహారాల్లో కంటే యితరులకు సలహా రూపంలో బాగా తోడ్పడతాయి. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో సంవత్సరాంతంలో అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన లాభించే వ్యవహారాలను కూడా వదులుకోవలసి వస్తుంది. ప్రయోజనం అంతగా ఉండని ప్రయాణాలు చేస్తారు. ఆరోగ్యం సామాన్యంగా ఉన్నా, కుటుంబంలో యితరులకు అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. శుభకార్యాల విషయంలో యిదివరకు ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి.

స్త్రీలకు—అప్పుడప్పుడు అనారోగ్యం చేస్తుంది. కుటుంబ కార్యక్రమాలు కొద్ది మార్పులతో నెరవేరతాయి. సాహిత్య కళారంగాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు. ఇదివరకు మీవలన ఉపకారం పొందిన బంధువులే యిప్పుడు మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

**మీనం:** ఏ వ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. వ్యాపారంలో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా కొన్ని వ్యవహారాలు మీ అదుపు తప్పి మీరు వూహించని పరిణామాలకు గురి కావచ్చును. కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం వలన కార్యభారం పెరుగుతుంది. వృత్తిలో నూతనావకాశాలో లభిస్తాయి. రావలసిన డబ్బుమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. మిత్రుల్లాంటి మనుష్యులే మిమ్మల్ని మోసం చేయగల ప్రమాదం ఉంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కొద్ది చికాకులు ఏర్పడి సర్దుకొంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి. విలాస యాత్రలు చేస్తారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి స్వల్ప ఆటంకాలు వస్తాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

—మహేష్.



# చెల్లాయికి ప్రేమతో



### పి. ఎస్.

చెల్లీ !

నువ్వు వ్రాసిన ఉత్తరం అందుకుని రెండురోజులైనా, వెంటనే జవాబు వ్రాయడానికి తీరలేదు. నువ్వేమీ అనుకోవని నాకు తెలుసు. ఏందుకంటే నేను కనుక రెండు రోజులకే జవాబు వ్రాస్తున్నాను. నువ్వైతే రెండు నెలలకైనా వ్రాయవు....నీ బద్ధకం విషయం తెలిసినదాన్ని గనుక నేను ఏమీ అనుకోను. నేను సెప్టెంబరులో వ్రాసిన ఉత్తరానికి నువ్వు డిసెంబరులో జవాబిచ్చావు....పైగా "అశ్రద్ధ చేశానక్కా" అంటూ గడుసుగా క్షమాపణ అడిగావు. ఈసారి నీకు అశ్రద్ధనుగూర్చి పెద్ద ఉత్తరం వ్రాయదలుచుకున్నానమ్మా.

ముందు అశ్రద్ధ చెయ్యడం, తరువాత మరచిపోవడం, ఆపైన కుంటిసాకులు చెప్పడంవుంది చూశావూ, అది చాలా చెడ్డ అలవాటనుకో. ఎప్పటికప్పుడు ప్రతి పనీ చురుకుగా చేయడం చాలా ఆరోగ్యకరం. ఒక్క ఉత్తరాలు వ్రాయడమేకాదు. కొన్ని విషయాలను అశ్రద్ధచేస్తే అవి ఎట్టి విష పరిణామాలకు త్రోవ చూపిస్తాయో నీవు వూహించుకో. నువ్వక్కడానివే ప్లేన్ ఎక్కి ఢిల్లీ వెళ్ళావు. క్షేమంగా చేరిన సంగతి వెంటనే వ్రాయకపోతే మాకెంత ఆందోళనగా ఉంటుందనీ! అబ్బ......చెప్పలేను— మా ఆయన టెలిగ్రాం యివ్వబట్టి బ్రతికాంగానీ—లేకపోతే మేమే అక్కడికి రావలసి వచ్చేది. నీకు గుర్తుండే ఉంటుంది. చిన్నతనంలో నీ కాలిబొటనవ్రేలికి ఎదురుదెబ్బ తగిలింది. దెబ్బకి కట్టు కట్టించుకోమని ఎంతగానో బ్రతిమిలాడింది అమ్మ. నువ్వు "చూద్దాంలే" అంటూ నెలరోజులుకుంటుతూ నడిచావు. చివరికి బొటనవ్రేలికి ఆపరేషన్ చేయాల్సి వచ్చింది. అసలు నువ్వు మొదటినుంచీ అంతే...."చేద్దాంలే" "ఇవ్వచ్చులెద్దూ" అంటూ ఉంటావు. పైగా "నీకు ఎప్పుడు తలుచుకున్నవని అప్పుడే కావాలి" అంటూ నన్ను కోప్పడుతూకూడా వుంటావు.

'ఎప్పుడు చేయవలసిన పని అప్పుడు చేయడంవలన చాలా ఉపయోగాలున్నాయి' అంటూ నేను వ్రాయడం మొదలుపెడ్తే "ఏమిటి నీ సూక్తిముక్తావళి. తలనొప్పి వస్తూందిబాబూ చదవలేక!" అని నువ్వు విసుక్కుంటావని నేను ఎరగనా చిట్టితల్లీ!! అందుకే ఆ మాట వ్రాయడంలేదు. చిన్నతనంలో మన బడి గోడలమీద 'ఎ స్టిచ్ ఇన్ టైమ్ సేవ్స్‌నైన్' వంటి సూక్తులు ఉండేవి. అవి చూసి పిల్లలు బుద్ధిమంతులౌతారని ఉపాధ్యాయుల ఆశ అయితే నాలాంటివారినిచూసి వాళ్ళు సంతోషపడవచ్చు. కాదనలేవుకదూ? ఉతికిపెట్టిన పట్టు చీరెలు "ఇస్త్రీ చేసుకుందాంలే, చేసుకుందాంలే" అనుకుంటూవుంటే హఠాత్తుగా పెళ్లి ప్రయాణం తగిలింది. ఇస్త్రీ పెట్టుకునే టైంలేదు. ప్రయాణానికి ఏర్పాట్లు చేసుకోవాలి కనుక. అంచేత చీరెకి అర రూపాయి చొప్పున చాకలికి యిచ్చి ఇస్త్రీ చేయించుకోవాల్సివచ్చింది. మన ఇంట్లో ఇస్త్రీపెట్టె ఉండికూడా. ఈ అనుభవం నాదికాదు. నీదేనని జ్ఞాపకం వచ్చి నవ్వుతున్నావుకదూ!

అంతేకాదు—చిన్నబాబు ఒకటవ తరగతి తెలుగు టెక్స్టు బుక్ కొంచెం చిరిగింది. కాగితాలు వూడాయి. "కుడదాంలే" అన్నావు—కాగితాలన్నీ పారేసుకుని కొత్తది కావాలన్నాడు. సంవత్సరం మధ్యలో కొత్త పుస్తకం దొరకలేదు. బ్లాకులో రెట్టింపు ఖరీదుపెట్టి కొనవలసి వచ్చింది. పేరంటానికి వెళ్లివచ్చి దండెంమీద వ్రేలాడ

## ఉగాది పచ్చడి

తెల్లని, శుభ్రమైన వేపపువ్వుని తెచ్చుకుని పళ్లెంలోపోసి రేకులు విడివడేలా బాగా చేత్తో కలపాలి. తర్వాత దాన్ని చేటతో చెరిగి తొడిమలన్నీ వేరు చేయాలి. ఇప్పుడు శుభ్రమైన తెల్లని రేకులుమాత్రం మిగుల్తాయి. అలా తీసిన పూవు ఒక గుప్పెడుంటే ఇంటిల్లిపాదికీ సరిపోయే పచ్చడి తయారవుతుంది.

కొత్తచింతపండును 100గ్రాములు తీసుకొని నీళ్లలో బాగా నానపెట్టి, చిక్కటి గుజ్జును తీయాలి. ఇలా తీసిన గుజ్జులో చింతపండు గింజలు,యీనెలు మొదలైనవి రాకుండా చూసుకోవాలి. బెల్లం (కొత్తదైతే బాగుంటుంది) శుభ్రమైంది 150 గ్రాములు తెచ్చి మెత్తగా పొడిచేసి, తయారుచేసుకుని సిద్ధంగా ఉంచుకున్న చింతపండు గుజ్జులో కలపాలి. తర్వాత విడిగా తీసి పెట్టుకున్న శుభ్రమైన వేపపువ్వును దాంట్లో కలపాలి. వో చిటికెడు ఉప్పు మెత్తగా నూరి కలుపుకోవాలి. ఆ మిశ్రమంలో బాగా పండిన అరటిపండ్లు రెండూ, పుల్లని మామిడికాయ ఒకటీ చెక్కుతీసి చిన్న చిన్న ముక్కలుగా చేసి కలిపితే ఉగాది పచ్చడి తయారైనట్లే. ఇలా తయారు చేసిందాన్ని, వెంటనే తినేరు! అంత రుచిగా ఉండదు. కనీసం వో పావుగంట దాన్ని కదపకుండా ఉంచితే అసలు రుచి వస్తుంది. అప్పుడు దాన్ని తింటే ఎంతో రుచిగా ఉంటుంది! ●

దీసిన కంచి పట్టుచీరె వెదలుకొరికితే చిన్న చెల్లాయికి పరికిణి కూడా కుట్టించావు.... ఈ అశ్రద్ధ పనుల 'లిస్ట్' వ్రాసి కోపంగా వున్నప్పుడు నీ ముఖం ఎలాఉంటుందో వూహించుకుంటే నవ్వొస్తోంది. ఆమధ్య నువ్వు దీపావళికి మా యింటికివచ్చినప్పుడు మీ ఆయన నిన్నటు పెరట్లోకి వెళ్లనిచ్చి "బద్ధక మహారాణి మీ చెల్లాయి" అన్నాడు. నివ్వలా అంటూన్నందుకు నాకు ఆయన మీద అప్పుడు మహా చెడ్డ కోపంవచ్చింది. అయితే నువ్వా సాయంత్రం తలంటుపోసుకున్న జుత్తు చిక్కు తీసుకుని దువ్వెనకున్న జుత్తును అలాగే వదిలి డ్రెస్సింగ్ టేబిల్ మీదకు గిరాటు వేస్తుండగా చూశాను. ఆయనమీదున్న కోపం కరిగిపోయింది. ఇప్పుడు నేను ఆయన పార్టీయేసుమా!

నీకెంత ఉక్రోషం వస్తుందో వూహించగలను కనుక ఇంక వ్రాయను ఆ విషయాలు. త్వరలో నీ చిట్టి చేతులతో ముత్యాలు కురిపిస్తూ ఒక చిన్న లేఖ, నన్ను తిట్టకుండా వ్రాస్తావని ఆశించే,

నీ

అక్క.

---

బాలసాహితి







తైమూర్ చక్రవర్తి తన రాజ్యంలోని మాంచి ధైర్యవంతులను ఏరి, తనకు అంగరక్షకులుగా నియమించుకునేవాడు. ఒక నాడు మౌల్వీ నసీరుద్దీన్ ఉంటున్న వూరిలో నుంచి అందరికన్న ధైర్యవంతుణ్ణి ఒకణ్ణి ఏరి తనవద్దకు పంపవలసిందని తైమూరు తాఖీదు పంపించాడు.

తైమూరుకి అంగరక్షకత్వం అంటే కొరివితో తల గోకుకోవడమేనని అందరికీ తెలుసు. కనుక ఎవ్వరూ వెళ్లడానికి ఒప్పుకోలేదు. కాని, ఎవరినో ఒకరిని పంపక తప్పదు. ఏమిటి సాధనం ? ఆఖరికి ఆవూరి పెద్దలంతా సమావేశమై ఏం చేయాలో ఆలోచించారు. అందరూ మౌల్వీ దగ్గరకు వచ్చి బ్రతిమాలేరు ఈ అపాయం నుంచి తప్పించమని.

తైమూరు దగ్గర అంగరక్షకుడుగా పనిచేయడమంటే మౌల్వీకి భయమే. అతడు కూడా పో పట్టాన ఒప్పుకోలేదు. వూరివారంతా తలకొక దీనారం చొప్పున చందాల్సు వేసుకుని, మౌల్వీకి సమర్పించుకుని, వెళ్లక తప్పదన్నారు. ఆఖరికి ఆయన ఈ పనికి అంగీకరించాడు.

వూరి పెద్దలు పదిమంది మౌల్వీని తైమూరు దగ్గరకు తీసుకు వెళ్ళారు.

"ఇతడే మా వూళ్ళో అందరిలోకీ ధైర్యవంతుడు."

బక్కచిక్కిన మౌల్వీని, అతడి కళ్లల్లో శిలగా కనిపిస్తున్న బెదురునూ, అతడిని పొగుడుతూన్న పెద్దలనూ తేరిపార చూచాడు తైమూరు. ఈ వ్యవహారం అంతా మోసం అని గ్రహించేడు. ఇతగాడి ధైర్యాన్నీ, నిర్భయత్వాన్నీ పరిశీలించాలను కున్నాడు. మంచి గురి ఉన్న విలుకాడిని పిలిపించాడు.

ఏం ప్రమాదం వచ్చిపడుతుందో నని మౌల్వీ భయపడుతూ మువునంగా నిలుచున్నాడు.

మౌల్వీకి పది బారల దూరంలో విలుకాడు నిలుచుని, విల్లు ఎక్కుపెట్టి, బాణం వదిలేడు. అది మౌల్వీ రెండుకాళ్ళ మధ్యనుంచి రివ్వున దూసుకుపోయింది.

ఈ హఠా త్పరిణామానికి మౌల్వీ హడలిపోయాడు. కెవ్వున కేక వేయబోయి కూడా, తాను అరుస్తే ఇటువంటి పిరికి పందని తెచ్చిన నేరానికి, తన వూరి పెద్దలకూ, తనకూ కాకుండా శిక్ష తప్పదని జ్ఞాపకం వచ్చి, బలవంతంగా నోరు నొక్కుకున్నాడు. కళ్ళు గట్టిగా మూసుకుని చావుకి సిద్ధం అయాడు.

విలుకాడు రెండవ బాణం వదిలేడు. అది మౌల్వీ పంకకింది నుంచి దూసుకుపోయింది. దానితోబాటు ఆయన కోటును కూడా చింపుకు పోయింది.

మూడవ బాణం మౌల్వీ నెత్తిన ఉన్న రూమీ టోపీని వూడదీసుకు పోయింది.

మౌల్వీకి ఇంచుమించు స్పృహ తప్పిపోయింది. నోట మాట లేకుండా బొమ్మలా కదలకుండా నిలుచుండిపోయాడు.

మౌల్వీ నిజంగానే గొప్ప ధైర్యవంతుడని తైమూరుకి నమ్మకం కలిగింది.

"శెబాష్ !" అని మెచ్చుకున్నాడు.

పరీక్ష పూర్తి అయిందని తెలిసి, మౌల్వీ చిరునవ్వు నవ్వేడు. నెత్తిమీద నుంచి పెద్ద బరువు దింపినట్లు వూరి పెద్దలు దీర్ఘముగా నిశ్వసించారు.

రాజు మౌల్వీ ధైర్యాన్ని మెచ్చుకున్నాడు. ఇటువంటి ధీరుణ్ణి తెచ్చినందుకు వారినందరినీ అభినందించాడు. మౌల్వీకి కొత్త కోటు, కొత్త టోపీ ఇవ్వవలసిందిగా హుకుం వేశాడు.

మౌల్వీ వంగి రాజుకి మువ్మూరు సలాం చేశాడు.

"దేవర వెయ్యేళ్లు వర్ధిల్లాలి ! కొత్త కోటు, కొత్త టోపీ నాకు ఎందుకు ఇప్పిస్తున్నారోతెలుసుకోవచ్చునా ?"

"అవి రెండూ బాణాలు గుచ్చుకుని పాడైపోయాయి కనుక."

"అదే దేవర ఉద్దేశమైతే నాకొక కొత్త లాగు కూడా ఇప్పించండి."

రాజు మౌల్వీ మాటలకు ఆశ్చర్యపడ్డాడు. "నీ లాగును మేము పాడు చెయ్యలేదే !"

"అది నిజమే. నేనే పాడు చేసుకున్నాను" అన్నాడు మౌల్వీ.

## వైజ్ఞానిక గాథావళి-53




# సూది కోసము సోది కెళ్లితే_

-బ్లాక్కు-

-డాక్టర్..

**పాత** కథలన్నీ బయట బడ్డాయిట. **విజ్ఞానసాధనలో** కూడా అలాటివి చాలా **జరిగేయి.** సున్నపు తేటని మందులోకి ఉపయోగిస్తారు. ఎడింబరో విశ్వవిద్యాలయంలో 1750 ప్రాంతంలో ఇద్దరు ప్రొఫెసర్లకి సందేహం వచ్చింది: "గుల్ల కాల్చి చేసిన సున్నం మీది నీరా, రాతిసున్నము మీది నీరా?—ఏది మంచిది మందులోకి?" అని. మన దేశంలో ధనవంతులు ముత్యపు చిప్పముకాల్చి చేసిన సున్నము శ్రేష్ఠమని నమ్మి దానినే ఉపయోగించేవారు తాంబూలంలోకి. పై సందేహం ఆ ప్రొఫెసర్లిద్దరూ తీర్చుకోలేదు కాని, ఆవాదం వింటూ ఉండిన జోసెఫు బ్లాకు తీర్చుకోడానికి పూనుకున్నాడు. అది పద్దెనిమిదో శతాబ్ది మధ్యమ మన్నమాట జ్ఞాపకం చేస్తున్నాను. అప్పటికి సైన్సు అన్నదే "ప్రకృతి తర్కము" అన్న పేరుతో శైశవదశలో ఉండినదంటే పై ప్రశ్నను ఇముడ్చుకున్న రసాయనశాస్త్రము మాట చెప్పేదేమిటి? అప్పటికివుండిన రసాయనిక విజ్ఞానము కొన్ని మందులు తయారుచేసి అమ్మేవారికి ఉండేది కనక, సున్నపునీటి తారతమ్యాన్ని పరిశోధించ యత్నించిన బ్లాకుకి అతని ఇంగిత జ్ఞానమే తోడయింది.

సున్నానికీ సున్నపు రాయికీ తేడా యేమిటో ముందు చూడామని పూనుకున్నాడు బ్లాక్కు. సున్నపు శిలల్ని బట్టీలలో కాల్చితేగాని మనము వెల్లవెయ్యడానికి కొనుక్కునే సున్నపురాయి అవదు. కాల్చినప్పుడు ఎర్రగా వెలుగుతుందీ, చల్లారిన తరువాత బయటికి తోడేసి సప్లై చేస్తారు. ఇలాగ కాల్చిన సున్నపు రాతిని తడిచేతితో పట్టుకుంటే రాయి అంటినంత మేరా కాలి, చెయ్యి బొబ్బ ఎక్కుతుంది. "ఎందుకు ఇలాగ అవుతుంది.?" అన్న ప్రశ్నకి ఆ రోజుల్లో జవాబు ఏమిటో తెలుసునా? "నిప్పులో కాల్చారుకదూ, సున్నపురాతికి ఈ కాల్చేగుణము నిప్పునుంచి అలవడింది" అని. ఈనాడు మనము ఈ ప్రశ్న వేసినా ఈ దేశంలో మన జానపదులనుంచి ఇలాటి జవాబే వస్తుంది. బ్లాక్కు కాల్చని సున్నపు శిలని తూచి, దాన్ని కాల్చి మళ్లీ తూచాడు. కాల్చినరాయి తేలికగావుంది. అంటే ఏమన్నమాటా? సున్నపుశిలను కాల్చితే దానిలోంచి ఏదో లేచిపోయిందీ, సున్నపు రాయి—కొంత తేలిక అయి మిగిలింది. ఇలాగ లేచిపోయిన దేమిటీ? సున్నపు బట్టీల లోంచి పొగ వస్తుందీ. అది ఘాటువాసన వేస్తుంది. అదేమిటీ అని బ్లాక్కు అడిగితే "గాలి" అన్నారు అనాటివారు. 'గాలి' అన్నమాటనే అన్ని వాయు పదార్థాలకీ వాడేరు ఆనాడు. గాలులలో రకాలున్నాయని అప్పటికి తెలియరాలేదు. బ్లాక్కు ఆ 'గాలి'ని జాడీలలో పట్టేడూ, పరీక్షలు చేశాడు. సున్నపు శిలమీద ద్రావకాన్ని వేసినప్పుడూ వస్తుంది అలాటి గాలి. "ఇది మామూలు గాలికంటె వేరు. ఇది సున్నపు శిలలో బిగించబడి ఉండినది కనుక దీని పేరు "బిగించబడ్డ గాలి" అన్నాడు.

సున్నము సంగతి అతని దృష్టినుంచి తప్పుకుంది. ఈ కొత్త గాలిని పట్టేడు. గాలిలో రకాలున్నాయని గుర్తించి చెప్పిన ప్రథమ వైజ్ఞానికుడు బ్లాక్కే. మెగ్నీసియం కార్బనేటును కాల్చినా ఈ కొత్త వాయువే వస్తుందని కనిపెట్టాడు. ఆ తరవాత ఇరవైయేళ్లూ రక రకాల వాయువులతో రసాయనికులు చేసిన పరిశోధనలకు అనగా వాయు విజ్ఞానానికి బ్లాకు పరిశ్రమే ప్రాతిపదిక.

నూట యాభయి డిగ్రీల వేడిమికి వెచ్చబెట్టిన పాదరసముతో, మరుగుతూ 100 డిగ్రీల వేడిమిని అందుకున్న నీటిని సమ కొలతలలో కలిపితే ఆ మిశ్రమము ఎన్ని డిగ్రీల ఉష్ణతను సూచిస్తుందీ? సగటు ఉష్ణత 125 డిగ్రీలు సూచిస్తుంటారు ఎవరేనా. బ్లాక్కు ఆ ప్రయోగాన్ని చేసి, ఆ మిశ్రమము ఉష్ణత 102° అని కనుకున్నాడు. పాదరసము ఉష్ణత 48 డిగ్రీలు పడగా, నీటి ఉష్ణత 2 డిగ్రీలు మాత్రమే లేచింది. ఆ రెండింటి కలుపులో వేడి ఎక్కడానికి నీరు ఎక్కువ ఉష్ణరాశిని వాడుకుంది. "వేర్వేరు పదార్థాలకు ఉష్ణమును గ్రహించగల ఉరవ వేర్వేరు" అని సూత్రీకరించాడు బ్లాక్కు. ఈ అభిప్రాయమే విశిష్టోష్ణత (Specific Heat) కు బీజము.

విశిష్టోష్ణతను గుర్తించినవాడు అంతర్గతోష్ణము (Latent Heat) ను గుర్తించలేదా ? అని అడుగుతారు పాఠకులు. మంచుగడ్డ ఉష్ణత సున్నా డిగ్రీలు. దాన్ని వెచ్చబెట్టుతూ ధర్మామీటరుతో ఉష్ణతను గమనించాడు బ్లాక్కు. ఎంతసేపూ సున్నాయే చూపింది ధర్మామీటరు. మంచుగడ్డ కరగి నీరవుతూనేవుందిగాని ఉష్ణత లేవలేదు, సున్నా వగ్గరేవుంది. మంచుగడ్డకు అందిస్తూన్న వేడిమి అంతా ఏమవుతూన్నట్టూ? గడ్డను కరిగించింది. "సున్నా ఉష్ణత దగ్గరవున్న మంచుగడ్డ సున్నా ఉష్ణత కడనేవున్న నీరుగా మారడానికి ధర్మామీటరుకు పొరకనివిధంగా ఉష్ణమును గ్రహిస్తున్నది"

అని నిశ్చయించుకున్నాడు బ్లాక్కు. మరి దానిని పట్టుకోడము ఎలాగా? మంచు కరిగి ఏర్పడిన నీటివల్ల. రెండు మంచు గడ్డల్ని నలుపలకల ముక్కలుగా అరగ దీసి ఒక దానికి—రుబ్బురోలుగుంటవంటి గుంటచేసి రెండోది మూత పెట్టాడు. సమానభారాలున్న లోహాల ముక్కల్ని ఆవిరిలో వేళ్ళాడగట్టి ఆ ముక్కలు ఆవిరి ఉష్ణతకు—అంటే 100 డిగ్రీలకు లేచిన తర్వాత, దానిని ఆ మంచుగడ్డ గుంటలో జార్చి రెండో మంచు ముక్క మూత పెట్టాడు. ఆ లోహపుముక్క మున్నా ఉష్ణతకి దిగడములో ఎంత వేడిమిని—అనగా ఉష్ణరాశిని—ఇచ్చిందీ అన్నది మంచు కరిగి ఏర్పడిన నీటితూకాన్నిబట్టి నిర్ణయించాడు. విశిష్టోష్ణతలు కనుక్కునేసులువుపద్ధతి!

ఈ రోజుల్లో మన స్వంతమైపోయింది అనుకునే విజ్ఞానపు శైశవాన్ని పోషించిన పూర్వ వైజ్ఞానికులలో బ్లాక్కు ఒకడూ. విజ్ఞానానికి—రసాయనశాస్త్రానికి ముఖ్యంగానూ—కావలిసిన తూకమూ ధర్మామీటరు కొలతా చక్కగా ఉపయోగించి విజ్ఞాన పురోగమనానికి రాచబాటలు తీర్చిన తొలిరోజుల వైజ్ఞానిక శ్రామికులలో బ్లాక్కు ఒకడూ. అతడు నేర్చినది వైద్యము. ఆతని పరిశోధన రసాయన శాస్త్రములో. అతనికి 1784 లో వచ్చిన డాక్టరేటు బిరుదు వైద్యశాస్త్రములో. అతడు ఉద్యోగములో చేరినది గ్లాస్గో విశ్వ విద్యాలయ ప్రొఫెసరుకి సహాయకుడుగా. భేషజములేని చక్కని చిక్కని పరిశోధన చేశాడూ, నిరోగనుగా భోజనము చేసూ చేస్తూ వెనక్కి వాలి కన్ను మూశాడు. ●

# గోవా జానపద గాథలు-కథకులు

రచయిత వి.ఎస్. సుఖ్తంకర్
అనువాదం పాలగుమ్మి పద్మరాజు



# నిజమైనతోకం……

పద్మనాభసేఠ్ జీవితంలో ఈవేళొక పర్వదినం. ఈ వూళ్లో 'బామన్లు'—అంటే సారస్వత బ్రాహ్మలకీ, సేఠ్‌లంటే విశ్వబ్రాహ్మలకీ, వానీలు—అంటే కోమట్లకీ, ఎప్పుడూ పోటాపోటీలు. పద్మనాభసేఠ్ ఆ వూరిసేఠ్‌లందరిలోకీ పెద్ద. 'బామన్ల'లో కందరికీ పోరోబ్ కుటుంబం మంచి ఉచ్ఛస్థితిలోఉంది. మూడు తరాలుగా రెజీదారుద్యోగం (గ్రామ మునసబులాంటిది) వాళ్ళసొత్తైపోయింది. వానీలందరిలోకీ ఖోలోప్ కుటుంబం బట్టల వర్తకంలో లక్షలార్జించారు. ఈ రెండు కుటుంబాలమీదా తనదే పైచెయ్యి అనిపించుకోవాలని పద్మనాభసేఠ్ తాపత్రయం. పండగల్లో, పబ్బాల్లో వాళ్లని ఓడించాలని చాలా ప్రయత్నం చేశాడు. పంచాయతీ ఎన్నికల్లో కూడా వాళ్లతో పోటీపడ్డాడు. పర్వదినాల్లో దేవాలయంలో ప్రతికులంవారూ ప్రదర్శించే నాటకాల్లో, ప్రభుత్వోద్యోగుల కిచ్చే విందుల్లో, ఆ వూళ్లో జరిగే ప్రతివిషయంలో తను పూనుకుని ముందు కొచ్చేవాడు. అయితే ఈ పోటీ ఇన్నాళ్లు జరిగినా, నిష్కర్షగా అతనికి విజయం లభించలేదు. అందు కవకాశం ఇప్పుడు దొరికింది. ఈవేళ అతని చిన్నారి కూతురు జయ పెళ్లి. ఆమె అతని కడసారిబిడ్డ. ఒకత్తే ఆడపిల్ల. మిగతా నలుగురు మొగపిల్లలకీ, పెళ్లిళ్లయిపోయి, తండ్రితో పాటు కులవృత్తి చేసుకుంటున్నారు. ఇలాంటి పెళ్లి ఆ వూళ్లో ఇదివరకెప్పుడూ జరగలేదనిపించాలని తండ్రితోబాటు వాళ్లకీ మంచి పట్టుదల.

క్రితం రాత్రి వూరేగింపులో పేల్చిన బాణాసంచాలాంటిది ఈమధ్యకాలంలో పోరోబ్, ఖోలోప్‌ల ఇళ్లలో జరిగిన ఏ పెళ్లిలో కూడా చూడలేదన్నారు వూళ్లో అంతా. బాణాసంచా మోతని మించిపోయింది అర్ధరాత్రి మేజువాణీ. కస్తూరీబాయి, మోగ్రీబాయి, సోదరీమణులంటే నాట్యంలో పెద్ద పేర్లు. ముందువరసలో కూర్చున్న పోరోబూ, ఖోలోపూ 'ఏమిటీ వింత' అన్నట్టు చూపులతోనే సంప్రదించుకున్నారు. ఎందుకంటే ఈ సోదరీమణులు గొప్పవారి ఇళ్లకుతప్ప, తమ ఎత్తు ధనం పోసినా రారు. మేజువాణీ అయిపోయాక తెల్లవారుజామున ఇళ్లకు పోతున్న పెద్దలంతా కస్తూరిబాయి భావగీతాలూ, మోగ్రీబాయి కేర్వానృత్యం అద్భుతంగా ఉన్నాయని ఏకగ్రీవంగా అంగీకరించారు. అయితే అన్నిటికన్నా అద్భుతమైన వింత ఈవేళ పెళ్లి విందులో రుచి చూడబోతున్నామని వాళ్లెవరూ ఎరగరు. తరతరాలుగా వస్తున్న సంప్రదాయాన్ని అనుసరించి, పెళ్లి విందు అన్నిటికన్నా గొప్పగా ఉండాలని పద్మనాభసేఠ్ నమ్మకం. కులాచారాన్నిబట్టి బామన్లూ, సేఠ్లూ ఏక పంక్తి భోజనం చెయ్యకూడదు. అంచేత పోరోబ్ కుటుంబం వారెవరూ విందుకు రారు. అయినా విందులో ఏమేమి వడ్డించారో తప్పకుండా వాళ్లు వాకబుచేస్తారని, పద్మనాభసేఠ్‌కి తెలుసు. ఖోలోప్ వారంతా ఎల్లాగా విందుకొస్తారు. వీరిద్వారా వారికి తెలుస్తుంది.

పద్మనాభసేఠ్ ఇంత సంతృప్తి ఇదివరకెన్నడూ అనుభవించలేదు. జరీ అంచు నీలం పట్టు పంచె కట్టుకుని, పంక్తుల మధ్య పచారుచేస్తూ, అతిథుల్ని తృప్తిగా భోజనం చెయ్యమని ప్రోత్సహిస్తున్నాడు. మామూలుగా పెళ్లి భోజనాల్లో వడ్డించే పిండి వంటలన్నీ అయిపోయాయి. అతిథులంతా ఆనందంగా తిన్నారు. అయితే వీటన్నిటివీ, తలదన్నే పిండివంట ఒకటి ఆఖర్ని వస్తోందని తెలిసేసరికి, వారి ఆశ్చర్యానికి, ఆనందానికి మేరలేదు. పద్మనాభసేఠ్ ఉత్సాహంతో ఉప్పొంగిపోతూ, పర్వతాల్లో పేర్చిన వెండి పళ్లాలతో వడ్డించేవాళ్ళు పందిట్లోకి రాగానే, ధారాళంగా వడ్డించమని వాళ్లని హెచ్చరించాడు. అతిథుల్ని ఉద్దేశించి రాజసం ఉట్టిపడేలాగ అన్నాడు, "మిత్రులారా! నేనేం జమీందారునికాను. పోరోబ్‌నీ, ఖోలోప్‌నైనా కాను. ఏదో నేనొక పేద విశ్వబ్రాహ్మణ్ణి. అయితే ఈ పెళ్లికూతురు నా కడసారిబిడ్డ. నలుగురు మగపిల్లల తరవాత లక్ష్మీదేవిలా మాయింట వెలిసింది. అంచేత ఏదో నా శక్తి వంచన లేకుండా తమబోటి పెద్దల్ని తృప్తిపరచి గౌరవించడానికి ఈ పెళ్లి విందు ఏర్పాటు చేశాను. మీ రాకవల్ల మాయిల్లు పావనమయింది. నా తల్లికి మీ ఆశీర్వచనం లభించింది. అయ్యా! మీ కిపుడు వడ్డిస్తున్న ఈ కుంకుంపువ్వు మిఠాయి పేరేమిటో మీ కెవరన్నా చెప్పగలరా?"

ఈ సవాలు విసిరి, అతను గర్వంగా అతిథుల వంక చూశాడు. అతిథులంతా మొగమాటం విడిచి ఆరగిస్తూనే ఉన్నారుకాని, ఆ మిఠాయి పేరుమాత్రం ఎవరూ చెప్పలేకపోయారు.

పద్మనాభసేఠ్ గర్వంగా రాజానవ్వు నవ్వాడు. ఆ తర్వాత చెప్పాడు. "దీనిపేరు షీవర్—కేవరీ. ఈ కనుమల కావలఉన్న జమీందారులూ, మహారాజులూ, ఆరగించే మిఠాయిది. ఈ అపురూపమయిన పిండి వంటని నేను ఎల్లా చేయించ గలిగానని మీ కందరికీ ఆశ్చర్యంగా ఉండొచ్చు" ఈ మాటలని, అతను వంటశాలలోకి వెళ్లి, ఒక బాన కడుపు గల ముసలివాణ్ని వెంటబెట్టుకుని వచ్చాడు. అతిథులందరికీ అతనొక 'భట్టు' అని ఎరుక పరిచాడు. గోవాలో మంచి ఉచ్ఛ స్థితిలో ఉన్నవారు సారస్వత బ్రాహ్మలైనప్పటికీ, వాళ్ళు చేపలు తింటారు. కాశ్మీరీ, బెంగాలీ బ్రాహ్మల్లాగా. భట్టులు చదువు సంధ్యల్లో సిరిసంపదల్లో వెనకబడ్డ కులమైనా, వాళ్లు శుద్ధ శాకాహారులు. ఈ భట్టుది శాహాపూర్. పేరు కేరూభట్టు. సాంగ్లీరాజావారి పాకశాలలో ప్రధానోద్యోగి. ఇటువంటి గొప్పవంట బ్రాహ్మణ్ణి సంపాదించడం మాటలా? తన దగ్గర బంధువున్నా డొకాయన—అంటేసాక్షాత్తూ తన చెల్లెలు బావగారి మేనమామకి వేలు విడిచిన తమ్ముడో, అన్నో, రామసేఠ్ అని—ఈ మధ్యనే శాహాపూర్‌లో ఇల్లూవాకిలీ ఏర్పరుచుకుని స్థిరపడ్డాడు. ఆయన పలుకుబడివల్ల దొరికాడీ భట్టు "ఇంత భగీరథ ప్రయత్న ఫలితంగా ఈనాడు మా పేద ఇంట్లో ఇటువంటి అపురూపమైన పిండివంట వండడం, మీవంటి పెద్దలది రుచి చూడ్డం జరిగింది. మన జిల్లాల్లో ఎవరూ దీని పేరన్నా ఎరగరు. దీన్ని వండినవాడు ఈకేరూభట్టు. మంచి శ్రోత్రియ బ్రాహ్మణుడు. సాంగ్లీ రాజావారికీ యనంటే ఎంతో అభిమానం" అంటూ ఆ పిండి వంట పుట్టు పూర్వోత్తరాలు వివరించి, కులాన్ని

బట్టి పంక్తులుగా కూర్చున్న అతిథులమధ్య, కేరూ భట్టు వెనకాల దొర్లుకుంటూరాగా, పచార్లు ప్రారంభించాడు పద్మనాభసేర్.

అప్పుడు అతనికంటపడ్డాడు త్రివిక్రమసేర్. ఆ వూళ్లో సేర్ లందరికీ వయసులో పెద్ద. ఇతను పోరోబ్, ఖోలోప్‌లకు దాసోహం చేస్తూ, సేర్ కులానికి చేటు చేకూరుస్తున్నాడని చాలా కాలంగా పద్మనాభసేట్ అనుమానం.

"సరే ఇప్పుడితన్ని కాస్త ఎద్దేవ పట్టించొచ్చు" అని లోపల అనుకుని, వడ్డిస్తున్న ఆసామిని పిలిచి ముసిలిసేర్‌కి కాస్త షీవర్లు దండిగా వడ్డించమన్నాడు. త్రివిక్రమసేర్ చేతులు కంచానికడ్డంగా పెట్టి "డబ్బయ్యోపడిలోఉన్న తనవంటి ముసలాణ్ణి ఈవిధంగా మొగమాటపెట్టడం న్యాయంకాద" న్నాడు. పద్మనాభసేర్ పక పక నవ్వి అన్నాడు.

"నువ్వంతమాత్రం నే నొప్పుకుంటానామామా! పోరోబ్ ఇంట్లోనో, ఖోరోప్ ఇంట్లోనో అయితే ఇలాంటి అభ్యంతరాలు చెపుతావా నువ్వు? అదీగాక నీ భోజన పరాక్రమం వూరందరికీ తెలుసు. నువ్వసలు ఆ కథలో హరిదాసు కేమాత్రం తీసిపోవు. ఆ పదం మీకు తెలుసుగా—

"నిడుపైనతోకవాడి పేరేమిటిరా—

నెయ్యంతా మింగేశావు నీ మొహం మండా—

# గోవా జానపద గాథలు

నిడుపైన తోకవాడు హనుమంతుడురా"

పద్మనాభసేర్ హరిదాసు సంగతెత్తి ఈ పదం పాడేసరికి, పెళ్లి పందిరంతా నవ్వులతో మారు మోగింది. కేరూభట్టుమాత్రం అర్థంకాక అటూ ఇటూ చూశాడు. పద్మనాభసేర్ అది గమనించి "ఆహా నీదీ గోవాకాదుగా, కనుమల కవతలనించి వచ్చావు. ఈ హరిదాసు కథ మా పసిబిడ్డలకి కూడా తెలుసు. నీకు చెపుతా విను" అని కథ ప్రారంభించాడు.

"అనగనగా ఒక హరిదాసుండేవాడు. ఇదివర కెన్నడూ హరిదాసు మొహం ఎరగని ఒక వూళ్లో అతను నాలుగునెల్లు తిష్టవేశాడు. వూళ్లోఅందరూ ఆ బ్రాహ్మణ్ణి అతి గౌరవంగా చూసేవారు. ప్రతి సాయంకాలం కథా కాలక్షేపానికి రావడమేగాక, హరిదాసుకి మంచి మంచి తినుబండారాలు కూడా సమర్పించుకునేవారు. హరిదాసుతో కూడా వంత పాటగా డొకడు ఉండేవాడు. అతను యువకుడు. హరిదాసే నోరూరే పిండివంటలన్నీ మెక్కుతుంటే ఆశగా చూసేవాడు. తన కేదన్నా కాస్త ముక్క రుచి చూపిస్తాడేమోనని, ఆశపడేవాడు. అయితే హరిదాసు మహా తిండిపోతు.

ఒకనాడొక రైతు ఒక గిన్నెతో నెయ్యి పట్టుకొచ్చి ఇచ్చాడు. దాని కమ్మని వాసనకి కుర్రవాడి నోరూరింది. ముసలాడే నెయ్యంతా తినలేడు. తనకి కాస్తయినా మిగిలితీరుతుందని ఆశపడ్డాడు. కాని హరిదాసు చిటికలో గిన్నెంతా ఖాళీ చేసేశాడు. వంతపాటగాడికి పాపం నేతి మరకయినా మిగల్లేదు. సాయంకాలం హరికథ ప్రారంభమయింది. వంటపాటగాడి దుగ్ధమాత్రం చల్లారలేదు.

ఆనాడు 'లంకా దహనం' కథ చెపుతున్నాడు హరిదాసు. పల్లెజనానికి ఆ కథంటే మహా ఇష్టం. హరిదాసు ఉపోద్ఘాతం ఎలాగో లాగిపారేసి, కథ పట్టులో కొచ్చాడు. కాని పాపం. అతని కంగారేం చెప్పను? కథా నాయకుడైన కోతి దేవుడిపేరే మర్చిపోయాడు. అతని భోజన శక్తి దిన దిన ప్రవర్ధమానమవుతోంది గాని, అతని జ్ఞాపకశక్తిమాత్రం ఆనాటి కానాటికి నీరసించిపోతోంది. అతను ఎక్కడన్నా మర్చిపోతే అందించడం, వంతపాటగాడి ధర్మం. అయితే అది అందించినట్టు సభా సదులకు తెలియకూడదు. పాడుతున్న పాటలోనే ప్రశ్న జోడించి, కథలో అదొక భాగం అనిపించేటట్టు హరిదాసు పాడతాడు. వంతపాటగాడు పాట రెండో పంక్తి పాడుతున్నట్టు నటిస్తూ, హరిదాసు మరచిపోయిన పేరు అతనికి అందిస్తాడు. వినేవాళ్లకు హరిదాసు అలిసిపోకుండా వంత పాటగాడు అందుకున్నట్టు అనిపిస్తుంది.

హరిదాసు ఆత్రంగా అడిగాడు.

"నిడుపైన తోకవాడి పేరేమిటిరా" అని పాడుతూ.

వంతపాటగా డీవేళ హరిదాసుకి మంచిపాఠం నేర్పాలని నిర్ణయించుకున్నాడు. తను సమాధానం చెప్పకుండా వూరుకున్నాడు. హరిదాసుని ఇరవై ముప్పైసార్లు అదే పంక్తి పదే పదే పాడనిచ్చి, ఆఖరికి కోపంగా గొంతెత్తి పాడాడు.

"నెయ్యంతా మింగేశావ్ నీ మొహంమండా,

నిడుపైన తోకవాడు హనుమంతుడురా!"

తన చమత్కారం, నటనా కౌశలంఅంతా ఉపయోగించి వినేవాళ్లు నవ్వినప్పుడల్లా ఆగి, కళ్లకు కట్టినట్టు ఆ కథ చెప్పి ముగించేసరికి పెళ్లి పందిరంతా నవ్వులతో వూగిసలాడిపోయింది. కేరూభట్టు బాన కడుపు కూడా అందులో పాల్గొంది.

నిజంగా ఇది పద్మనాభసేర్ జీవితంలో పర్వదినం. ఖోలోప్‌లమీదేకాదు. కొమ్ములు తిరిగిన పోరోబ్‌లమీద కూడా గొప్ప విజయం సాధించాడు.

ఏళ్లు గడిచినకొద్దీ ఆ రాత్రి బాణ సంచా ధగధగలు జనం మర్చిపోవచ్చు. కస్తూరీ, మొగ్రీం ఆట పాటలు మరికొంత కాలానికి, మరపు తెరల మధ్య పడిపోవచ్చు. కాని, పద్మనాభసేర్ చేయించిన కేసరి షీవర్లు, దాని రుచిని తన చమత్కారంతో, హాస్యంతో అతను ఇనుమడింపజేసిన సంగతి, అతని గారాబు కూతురు, తన చిట్టితల్లి జయు, నలుగురు మొగపిల్లల తరవాత తన ఇంట వెలసిన లక్ష్మీదేవి పెళ్లి విందు ఇవన్నీ తర తరాలవరకూ ఆప్యాయంగా కథలా చెప్పుకుంటారు ఆ వూరి జనం.

(అయిపోయింది)




వీరు ఉతికితే బట్టలన్నియు మెరిసే తెల్లగాను, పరిశుభ్రంగాను వుంటాయి! సర్ఫ్ యొక్క ఉతికే అధిక శక్తివల్లనే! ముద్దల కొద్దీ నురగ! మీ చీరలు, వోణీలు, షర్టులు, పిల్లల బట్టలు ...ఏవైనా అమిత తెల్లగాను, అతి శుభ్రంగాను వుంటుంది. సర్ఫ్‌తో ఇంట్లో ఉతుక్కోండి!

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును

హిందూస్థాన్ లీవర్ ఉత్పత్తి

# పద్మశ్రీ భానుమతి

**విలేఖరి ప్రశ్న:—మీకు 'పద్మశ్రీ' వచ్చిందని తెలిసి అందరితోబాటు, మేమూ సంతోషించాం. దీనితో మీ 'వ్యక్తిత్వం' మరి కొంత రాణింపుకు వచ్చి ఉండవచ్చు. మీరీ నాడు యింతవారు కాగలిగారంటే అందుకు కారణా లేమయివుంటాయి?**

పద్మశ్రీ జవాబు:—కారణాలంటూవున్నా, అవి అసాధారణాలేమీకాదు. భగవదత్తమైన సామర్థ్యం, శక్తి ఉన్నాయి. వాటిని చిన్నతనంనుంచే పెంపొందించుకొని, సద్వినియోగం చేసికొనేందుకు తగిన అవకాశాలు మా నాన్నగారు కలిగించారు.

**ప్రశ్న:—అంటే, ప్రారంభంనుంచీ మీకీ నటనావృత్తితో ఆసక్తి ఉండేదా?**

జవాబు:—పూర్తిగా దీనిమీదనే నాకు ఆసక్తి ఉందని చెప్పను. ఇంతకంటే ముఖ్యమైనవి, ప్రియమైనవి ఉన్నాయి. ఉదాహరణకు సంగీతం, చిత్రకళ, రచనావ్యాసంగం, సినిమా దర్శకత్వం, సినిమా కూర్పు (ఎడిటింగ్) మొదలయిన అంశాలపట్ల యింతకుమించిన ఆసక్తి ఉండేది. నటించాలని, మహానటి కావాలని నే నెన్నడూ ఆశించలేదు. కాని, నాకు వచ్చిన అవకాశాలన్నీ ఆ పరిధిలోకే వచ్చినవుడు, చేతులారా వాటిని ధ్వంసం చేయలేదు. అందుకే నాకిప్పటికీ ఆశ్చర్యం వేస్తుంది. నాకు ఎక్కువ యిష్టంలేని వ్యాపకం—నటన—ద్వారానే నాకు చాలా పేరొచ్చింది. అదేవిచిత్రం!

**ప్రశ్న:—అహోరాత్రాలు పనిచేసే సినిమా 'సినిమారంగం'తో మీ బాధ్యతలను నిర్వర్తించేందుకు, గృహిణిగా, తల్లిగా......పరిస్థితులను ఎన్నడయినా ఎదిరించవలసి వచ్చిందా?....... ఈ రెండూ ఒకదానితో మరొకటి ఘర్షణ పడలేదా?**

జవాబు:—భగవంతుడు మేలుచేసి అలాంటి దెన్నడూ జరగలేదు. సాంసారికజీవితం, సినిమా వ్యాసంగం ..... యీ రెండింటికీ రెండు రహదారులు ఏర్పరిచాను. ఆమాట కొస్తే, పెళ్లి అయిన తరువాత, అసలు 'సినిమా'ల నుంచే సెలవు పుచ్చుకొందామనుకున్నాను. కాని, బి. ఎన్. రెడ్డిగార్లలాంటి పెద్దల ప్రోద్బలంవలన ఆ పని చేయలేకపోయాను. గృహకృత్యాలకు తగినంతకాలాన్ని



కేటాయించుకునేందుకే నేను నటించే సినిమాల సంఖ్య తగ్గించుకొన్నాను. సినిమాలకంటే, నా యింటి వ్యవహారాలకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చాను. అందువల్ల నాకు అప్పటికీ యిప్పటికీ యిల్లే ముఖ్యం !

**ప్రశ్న:—మరో సంగతి. ఈనాడు మన దక్షిణాదిన సినిమారంగంవున్న స్థితిగతులు మీకు తెలియనివికావు. కేవలం తారలకు ప్రాముఖ్యతనిచ్చే 'స్టార్ సిస్టమ్' అనే విధానం పెరిగిపోవటంవలన, సినిమాల పెరుగుదల స్తంభించిపోలేదా?**

జవాబు:—నిజమే. తెలుగు, తమిళంలోను యీ పద్ధతి మరీ ఎక్కువగా ఉన్నది. ఉన్న పళంగాచూస్తే, మనం బెంగాలీవాళ్లను అనుసరిస్తే మంచిది. పాత్రలను ముందు. ఆతర్వాతనే నటవర్గం. నటులు కొత్తవారు కానీయండి, పాతవారు కానీయండి—వారి వారి పాత్రలకు బాగా సరిపోయేవారు కావాలి. బెంగాల్ మనకు ఆదర్శప్రాయం కావాలి.

**ప్రశ్న:—ఇవన్నీ జరక్కపోతే......?**

జవాబు:—ఏముంది? మన సినిమారంగం యింకా అధోగతిపాలవుతుంది.

**ప్రశ్న:—అలా అనుకొంటే, యీ 'స్టార్ సిస్టమ్' మీకూ వర్తిస్తుందేమో?**

జవాబు:—మీకా అనుమానం అక్కర్లేదు. నేను 'స్టార్' కంటే చాలా పెద్దదాన్ని. (అయామ్ మోర్ దాన్ ఏ స్టార్!)

**ప్రశ్న:—తెలుగులో కూడా, కొన్ని ఇతర దక్షిణాది భాషాచిత్రాలతోబాటు ప్రమాణాలు పతనం అయిపోతున్నాయికదా! వీటికి యిక మరో మార్గం లేదా ?**

జవాబు:—మనవాళ్లకు ఎప్పుడు కొన్ని గుడ్డి నమ్మకాలున్నాయి. ఒకే మూసలో నుంచి తయారయే 'ఫార్ములా' చిత్రాలు మనకు ఎక్కువగా వస్తున్నాయి. ముందు యీ పద్ధతి పోవాలి. ఫలానావారు తీసిన ఫలానా సినిమాలో "ఏం వుంటే బాగా డబ్బొచ్చిందో" చూసుకోవటం, కొత్త సినిమాల్లో కూడా మక్కీకి మక్కీసరిగ్గా అవే దించటం పరిపాటి అయిపోయింది. కొత్తదనం లోపిస్తున్నది. దీనికితోడు స్టార్ సిస్టమ్. ఇవన్నీ కలిపి, మన సినిమా ప్రమాణాల పతనానికి రాచమార్గాన్ని ఏర్పరిచాయి. పైన అనుకొన్నట్లు, యీ సందర్భంలో 'బెంగాల్'ను అనుసరించటమే శ్రేయస్కరం. సత్యజిత్ రాయ్ లాంటి మహాపురుషులకు పుట్టిల్లు బెంగాల్.

**ప్రశ్న:—అంతటి 'సీరియస్' కథలను, భావాలను మనవారు జీర్ణించుకో గలుగుతారా?**

జవాబు:—వెంటనే యిది జరుగకపోవచ్చు కాని, అంతటి బృహత్ప్రయత్నానికి మొదలంటూ జరగాలి కదా?

**ప్రశ్న:—'సినిమా' అనేది మనదేశంలో... ప్రజాభిప్రాయం ప్రధానమైన ప్రజాస్వామిక దేశంలో, చాలా విలువైన సాధనం... కాని, ప్రజలు విరగబడి సినిమాలు చూస్తున్నప్పటికీ, యిందుకు సంబంధించినవారిమీద ఎవరికీ గౌరవం ఉండదని మీకు తెలుసా?**

జవాబు:—తెలుసు. చాలా బాగా తెలుసు.

చాలామంది ప్రజలకు గౌరవంలేదు. కారణం మన 'సినిమాలు' గౌరవింపబడే స్థితిలో లేవు. సినిమాలకు గౌరవం వచ్చిననాడు వ్యక్తులకు కూడా గౌరవం దానంతట అదే వస్తుంది.

ప్రశ్న:—అయినప్పటికీ సినిమాలు చూస్తూనేవున్నారుగదా?

జవాబు:—చూస్తారు. సినిమాలు చూసే సామాన్యులకు వీటన్నిటితో నిమిత్తంలేదు. వాళ్లకు కొంత కాలక్షేపమూ, మరికొంత వినోదమూ కావాలి. అందుకే సినిమాలు చూస్తారు!

ప్రశ్న:—మీరూ కథలు వ్రాశారు. మీ కథలకు ఒక గుర్తింపు లభించినట్లు కూడా కొందరంటున్నారు. మన తెలుగు సినిమాలకు ఇంతకంటె మంచి కథల ఆవశ్యకతను మీ రెన్నడైనా గుర్తించారా?

జవాబు:—తప్పకుండా అవసరమే. సినిమాకుకథ ఆయువుపట్టులాంటిది.

ప్రశ్న:—మరి,ఆరోజు ఎప్పుడువస్తుంది?

జవాబు:—ఆరోజు రావటానికి ఆ పరిస్థితులు కూడా మారాలి. సినిమాతీయటం అనేది ఏ ఒక్కమనిషీ చేసేపనికాదు. రక రకాల రంగాలలోవుండే, పలువురు సాంకేతికనిపుణులు కావాలి. దీనికందరూముఖ్యులే.

ప్రశ్న:—కథలస్థాయి పెరగటానికి మీరు చేసే సూచన ఏమిటి?

జవాబు:—కథలు ఎన్నుకోవటంలోనే ఆ జాగ్రత్త ఉండాలి. నిర్మాతలకు ఆ 'అభిరుచి' ఉండాలి. ప్రతి నిర్మాత నో 'సంఘ సంస్కర్త'కానవసరంలేదు. కాని, ఉచితానుచితాల వ్యత్యాసం తెలిసికోగలిగితే చాలు.

ప్రశ్న:—ఈనాడు అలా తెలిసిన నిర్మాతలెవరూ తెలుగులో లేరా?

జవాబు:—ఉండొచ్చు. కాని, అలాంటి అభిరుచి ఉన్నవారు కూడా ముందుకురావటం లేదు. ప్రజలకు 'ఫలానా' కథ నచ్చుతుందో, నచ్చదోనని అందరూ సందేహిస్తున్నారు.....ఇలాంటి సందేహాలవలన ప్రయోజనం శూన్యం. ప్రజల అభిరుచులుమార్చే బాధ్యత కూడా నిర్మాతలదే! కాని, డబ్బే ప్రధానంగా పెట్టుకొన్న నిర్మాతలకు ఇవ్వేవీ పట్టవు. ఒకప్పుడు మాలపిల్ల, వింతో గౌరవం వచ్చింది ..... నిర్మాతలకు 'ధనార్జన'మీద మోజుండటం తప్పుకాదు. ఆ మోజుకుతోడు కాస్త అభిరుచివుంటే మంచి చిత్రాలొస్తాయి.

ప్రశ్న:—మీరూ నిర్మాతలే ననుకొంటా!

జవాబు:—కాదనను. మేం తీసిన సినిమాలు, మిగతావారు తీసిన సినిమాలు పోల్చి చూడండి...... ఆ తేడా తెలుస్తుంది. మాలాంటి సంస్థలు మొత్తం పదివుంటే చాలు. ప్రేక్షకుల అభిరుచులు సులభంగా మారిపోతాయి.

ప్రశ్న—సంగీత దర్శకురాలిగాను, గాయనిగా చెప్పండి.....మన సినిమాలలో వినిపించే సంగీతం చాలావరకు 'కాపీ' సంగీతం కాదా? అని. విదేశాల్లో వినిపించే బాణీలు, సంగీతమూ మనవాళ్ళు 'అవలీల'గా కైవసం చేసుకొంటున్నారట. దీనిపై మీరు చేయగలిగే వ్యాఖ్య ఏదయినా ఉందా?

జవాబు:—పిచ్చివాళ్ళు మనవాళ్లు! మనం అరువు తెచ్చుకొంటున్నామనుకొంటున్న సంగీతంలో ఎక్కువభాగం మనదే. అసలు పాశ్చాత్య సంగీతం అనీ, మన సంగీతం అ యిన్ని లేవు. ప్రపంచం మొత్తంమీద సంగీతం అనే పదార్థం ఒకటే. గాయకులు, సంగీత దర్శకులు, వాటిని వినిపించే విధానాలు మారినంతమాత్రాన సంగీతానికి సరిహద్దులు నిర్ణయించలేం. పాశ్చాత్య సంగీతమే తరచి తరచిచూస్తే, అందులో మనవారి 'రాగాలు' కొన్ని వినవస్తాయి.

ప్రశ్న:— దేశంలోకెల్లా 'తొలి పెద్ద అయినరాష్ట్రపతి అందచేసే 'పద్మశ్రీ'కంటే సాహిత్య అకాడమీ అవార్డునే చాలా మిన్నగ భావిస్తానని ఆమధ్యఒకచోటచెప్పారు కదా!

జవాబు:— అవును. పైనే చెప్పినట్లు, నాకు రచనా వ్యాసంగంపట్ల, సాహిత్య రంగంపట్ల మక్కువ ఎక్కువ. 'సాహిత్య అకాడమీ అవార్డు' రావటం నాలో కొత్త చైతన్యాన్ని కలిగించింది. అందుకే ఆ అవార్డును మిన్నగా భావించాను. 'పద్మశ్రీ' రావటం, నా అభిమానులతోపాటు నాకూ సంతోషదాయకమే!

—వాశిరాజు ప్రకాశం●





# తెలుగునాట కళా ప్రాశస్త్యాన్ని చాటటమే నా ధ్యేయం

మంచిగా చూపుతూ, వినోదాన్ని అందించే సంస్థ సేవకుడు. ప్రజానీకానికి అతను అందివ్వగల ఆనందంలోనే తన ధ్యేయం, చిత్ర విజయం యిమిడి ఉన్నాయి. ఇదే కళాత్మకమైన వ్యాపారం ఇటు పుణ్యం, అటు పురుషార్థం సాధించగలిగినవాడే ఆదర్శప్రాయమైన దర్శకుడు. అతనియొక్క విజయంలోనే సంస్థ, నిర్మాత, జీవం—నటీ నటుల పేరు ప్రతిష్ఠలు, సాంకేతికుల మనుగడ, నిర్మాణ రంగంలో ఇమిడిపెట్టుకొనియున్నఅనేక కుటుంబాలకు ఆధారం, రక్షణ కల్పించినవాడవుతాడు. అతడు ఏమాత్రం పరాజయం పొందినా, తన బాధ్యత నిర్వర్తించలేకపోయినా, తన వృత్తిలో కృతకృత్యుడు కాలేకపోయినా చిత్ర నిర్మాణరంగానికే పరాజయం పొందించినవాడవుతాడు. ఇంతటి గురుతరబాధ్యత కలవాడు దర్శకుడు. కళను, కనకాన్ని కలిపి రంగరించి కళ్లకు యింపైన సృష్టిని కల్పించే కథానాయకుడు.

చిత్ర నిర్మాణరంగంలో కథ, రచన, చిత్రానువాదం, సంగీతం, నృత్యం, కళ, పాత్రకల్పన, కూర్పు యిత్యాది అనుబంధ కళలన్నింటినీ సమన్వయం చేసుకొని ఏకత్వంచేకూర్చి దర్శకత్వం నిర్వహించటమే నేర్పు. నటీ నట సాంకేతిక నిపుణులకు కావలసినవిచ్చి, ప్రతిభను పూర్తిగా వినియోగించవలసిన బాధ్యత కూడా దర్శకునిదే. అందరూ అతని ఆజ్ఞానువర్తులే. అతని భావమే చిత్రము.

**నటునిగా...**

ఇప్పటికి అనుభవం 18 సంవత్సరాలు దాటింది. నటించిన చిత్రాల సంఖ్య 170 దాటింది. వీటిలో రూపకల్పన చేసిన భిన్న పాత్రలు 140 పైగా ఉన్నాయి. ఈ అనుభవంతో విమర్శ చేసుకుంటే, నటునిగా ఒక వ్యక్తికి ఎన్ని పరిణామాలు వస్తాయి, ఎంత నేర్చుకోవలసినది ఉన్నది, అది నేర్చుకోవడానికి, ఆ లక్ష్యాన్ని, గమ్యాన్ని కనుచూపుమేరలోనైనా చూడటానికి తన జీవితం చాలదని నాకు తోస్తుంది. ఈ నాటి చాలని వయస్సుతో సాధ్యమైనంతవరకు కళా కంఠంతోనే యిన్ని భిన్న మనస్తత్వాలతో కూడిన పాత్ర నిర్వహణాభారం నెత్తిన వేసుకోవడం కూడా జరిగింది. తెలుగువాడిగా, అభిమానులచేత ఆదరణ అందుకో గలిగిన అదృష్టశాలిగా క్రొత్త ప్రయత్నాలు చేయాలి క్రొత్త అంతస్థులకు ఎగ్రబాకాలి

నవ్యత్వం సృష్టించాలి నేను ఉన్నస్థానాన్ని గుర్తుంచుకొని నా సంస్కార యోగ్యతకు అనుగుణంగా చలన చిత్ర చరిత్రలోనే నూతనత్వాన్ని సృష్టించి అశేష ఆంధ్ర కళాభిమానుల ఆదరాన్ని పొందాలనే అభిమతంతోటే కొన్ని సాహసాలు కూడా చేశాను. ఈ సాహసమే లేనివాడు శ్రీకృష్ణ, శ్రీరామ



దుర్యోధనపాత్రకు రూపకల్పన .

పాత్రలుండేవేమోకాని రావణ, దుర్యోధన పాత్రలకు రూపకల్పన జరిగి ఉండేదికాదు. యుగళగీతాలతో సరిపెట్టుకొనిఉంటే భీష్మ బ్రహ్మనాయక పాత్రలను ధరించి ఉండేవాడినికాదు ఏదో చేయాలని ఆశ, యింకా ఎంతో చేయాలని ఉద్వేగం పరుగెత్తి పైబడి వస్తున్న కాల గమనంతో మనోబలాన్ని పందెం పెట్టి కళాకారుడిగా తెలుగు కళామతల్లికి నేను చేయగలిగిన సేవ యిదే. ప్రారంభదశలో కెమేరాముందు నిలబడి, లైట్సువేసి, క్లాప్‌కొట్టిన తర్వాత కవిగారు వ్రాసిన సంభాషణ నోట చెప్పగలిగేవాడు వాచకంతో ఈ సంభాషణను అందుకో యిమిడిఉన్న చమత్కృతిని, భావగర్భితంగా చెప్పాలని లెక్కలు వేసుకొన్నట్టుగా పొడిగ్గా అది ఆవిధంగా కెమేరాముందు చూపగలిగితే చాలు అనుకునేవాణ్ని. అది రెండవ దశ. ఇక ప్రస్తుతం సంభాషణ, నటన ప్రాధాన్యతనుసరచి, ఆ పాత్రలో జీవించగలగడమే యీనాటిలక్ష్యం. పాత్రకు అనుగుణ్యంగా సంభాషణ ఉచ్ఛరించగలగాలి. ఆ సంభాషణకు అనుగుణ్యంగా నటన తెలియకుండానే హావ భావ ప్రస్ఫుటీకరణ జరగాలి. అన్నీ కలిసి ఆ పాత్రలో సజీవంగా యిమిడ్చగలగాలి అనేనటునిగా యీనాటి నా ప్రయత్నం.

నే నా విద్యుక్త బాధ్యతా నిర్వహణతో ఏమాత్రం విజయం సాధించగలిగినా అది నా అభిమానులిచ్చే ఆదరణవల్లనే. సువిమర్శలకు తల ఒగ్గడంలేదు. కువిమర్శలను విస్మరించడం లేదు. నటునిగా కళారాధకుల, కళాప్రియుల ఆశీస్సులందుకొని ముందుకు సాగడమే నా లక్ష్యం. కళామతల్లికి నీరాజనమిస్తూ, నా తెలుగునాట కళా ప్రాశస్త్యాన్ని చాటటమే నా ధ్యేయం.

"అబ్బ! ఎంత బావుంది బొమ్మ! ఏమిటిది ?''

"ఇదో అందమైన బొమ్మ పాలరాతితో బెంజోని అనే కళాకారుడు 1876 లో తయారు చేశాడు. అందమైన కన్నెపడుచు, ఆ కన్నెపడుచు సిగ్గు దొంతరలను దాచే మేలి ముసుగు ఎంతో బావున్నాయికదూ..'' అంటూ మా వెంట వచ్చిన 'గైడ్' చెప్పుకుపోతున్నది.

ఆ బొమ్మను, అందాలు చిందించే ఆ శిలా విగ్రహాన్ని చూస్తుంటే అదో మధురమైన భావన కలుగుతుంది. దానిపేరు "వీల్డ్ రెబెకా'' అని మాతో వచ్చిన గైడ్ చెప్పింది.

ఆంధ్రుల రాజధాని నగరపు శోభకు మెరుగులు దిద్దుతున్న ఆకర్షణలలో సాలార్ జంగ్ మ్యూజియాన్ని విస్మరించలేం. తెలుగు వారు కానీయండి, ఆంధ్రేతరులు కానీయండి—హైదరాబాద్ వెళ్లారంటే, తప్పకుండా చూచే ప్రదేశాలలో మ్యూజియం కూడా ఉంటుంది.

'టూరిజం' అంటే నా కెంతో ఆసక్తి అందునా, మన విజ్ఞానాన్ని, చరిత్రసత్యాలనీ తెలిపే మ్యూజియంలు - నన్నెప్పుడూ ఆకర్షిస్తాయి.

అందుకే తొలిసారిగా సాలార్‌జంగ్ మ్యూజియానికి వెళ్లటం నాటికీ, నేటికీ నాకో చిత్రమైన అనుభూతి. విశాలమైన గదులు, కని, విని ఎరుగనటువంటి అక్కడి ప్రదర్శనా వస్తువులు చూస్తుంటే, మనకు తెలియని మరోలోకంలో విహరిస్తున్నట్లో, లేదా, చరిత్రకు ప్రతినిధులయినవాటితో ముఖాముఖీ మాటాడుతున్నట్లో అనిపిస్తుంది.

సాలార్‌జంగ్ మ్యూజియంలో ప్రవేశిస్తూ ఒక్కొక్క గది దాటుతూవుంటే, మ్యూజియాన్ని గురించి, అక్కడి వస్తువులను గురించి యింకా యింకా తెలిసికోవాలనిపించింది. అక్కడి బొమ్మలు, యితర వస్తువులు చూస్తుంటే కళ్లు ఒక్కసారిగా మెరిసిపోయాయి.

ముఖ్యంగా "వీల్డ్ రెబెకా'' బొమ్మ దగ్గర ఎంతసేపు నిలుచుండిపోయామో లెక్కలేదు. ప్రాణాల్లేని బొమ్మలకు ప్రాణదానం చేయకలిగిన కళాకారుడు ఎంత గొప్పవాడు! మేలి ముసుగుతో తన సిగ్గు దొంతరలను దాచుకున్న కన్నెపడుచు, పాలరాతితో మెరిసిపోతుంది. ఆ మేలిముసుగుకూడామన నైలాన్, టెర్లిన్‌లాగా పలచగావుంది. అదే చిత్రంగా వుంది. "అద్దాల మందిరం'' అనే "మిర్రర్ హాల్''లోవున్న యీ విగ్రహం అక్కడి ఆకర్షణల్లో చాలా ముఖ్యమైనది.

"ఒక్క మన ఇండియాలోనేకాదు. పర్షియా టర్కీ, బర్మా, చైనా, జపాన్ మొదలయిన దేశాల్లోని 'అద్భుతాలను' కూడా ఈ మ్యూజియంలో ఉంచారు.'' అన్నది మా గైడ్, మా ఆశ్చర్యానికి, తామూ ఆశ్చర్యపోతూ

"అవన్నీ ఎలా దొరికాయి?'' నేను అడిగాను తెలిసికోవాలనే కుతూహలంతో.

"ఇందులో దొరకటం అంటూ ఏమీ లేదు. ఇవన్నీ కష్టపడి సేకరించినవే ఈ పనంతా చేసింది ఒకే ఒక వ్యక్తి అంటే నమ్మలేం. కాని, అది నిజం'' అంది గైడ్.

వేల సంఖ్యలోవున్న యీ విలువైన వస్తువులను ఒకే వ్యక్తి సంపాదించారంటే ఆనాడే కాదు, ఈ నాటికీ నమ్మలేకుండా ఉన్నాను. మనదేశంలోనే, వేర్వేరు కాలాలనుంచి వుండిపోయిన వస్తువులతోబాటు, ఇతర దేశాల్లో ప్రాముఖ్యతను సంతరించుకొన్న వాటినికూడా యిక్కడకు రప్పించటం, వాటిని శ్రద్ధతో దాచటం...... నిజంగా ఆయనెవరో చాలా గొప్పవారయి ఉండాలి.

"ఎవరాయన? మన దేశస్థుడేనా'' అడిగాను.

"మన దేశస్థుడు కాకపోతే యిక్కడెందుకు మ్యూజియం పెడతారు?''

"ఆయన పేరు?''



రవిమూర్తి

వాసంతి

# మ్యూజియంలో ఒకనాడు...

# చారిత్రిక వైభవానికి ప్రత్యక్ష సాక్షి... సాలార్ జంగ్ మ్యూజియం



దర్శనార్థం విచ్చేసిన ప్రముఖులు

"ఆయనపేరు నవాబ్ మీర్ యూసఫ్ అలీఖాన్. తన యావజ్జీవితాన్ని యీ మ్యూజియం కోసమే గడిపారు. నిద్రాహారాలుమాని, యీ వస్తువులను సేకరించారు. కాని, తాను సేకరించిన వస్తువులీ యిలా 'మ్యూజియం'లో చేరకముందే పాపం ఆయన...... 1949లో.....కన్నుమూశారు. ఆయన మూడవ సాలార్ జంగ్ కనుకనే దీనికి సాలార్ జంగ్ మ్యూజియం అని నామకరణం చేశారు. పాపం ఆయన బ్రతికున్నంతకాలం, యీ పనిలోనే నిమగ్నులయారు." అంటూ మా గైడ్ చెపుతుంటే మాకు నిజంగా ఆశ్చర్యం వేసింది.

సాలార్ జంగ్ రాజా చనిపోయాక కొద్ది సంవత్సరాలకే ఆ వస్తువులన్నీ 'మ్యూజియంగా' అమరాయి. ఆయన మరణించిన సంవత్సరంలోనే 1949లో భారతప్రభుత్వం ధర్మకర్తల సంఘాన్నొకదానిని నియమించి, యీ ఎస్టేట్ వ్యవహారాలు ఒక దోవకుతీసికొచ్చింది. అప్పుడే సాలార్ జంగ్ మ్యూజియం ఒక రూపధారణ చేసికొంది.

ఇలా చెప్పుకొంటూ, తెలియనవి తెలిసికొంటూ ఒక్కొక్కగదిలోకి వెళ్లాం. 'ఓరియంటల్ సెక్షన్' కెళ్లాం. దాదాపు 30 గదుల్లో ఈ విభాగానికి సంబంధించిన వస్తువులను అమర్చి ఉంచారు. పర్షియన్ తివాసీలు, మొగలాయిల సౌందర్య చిహ్నాలు, రాజపుత్రుల కళాఖండాలు, ఇతర భారతీయ కళాకారుల కళాసృష్టి, కాశ్మీర్ శాలువలు, దక్షిణాది కాంస్యసంపద, మలబార్‌కు చెందిన కలప చెక్కడాలు మొదలయినవన్నీ ఇందులో ఉన్నాయి.

దీని తరువాత "ఇండియన్ సెక్షన్" చూశాం. ఒకప్పుడు ఔరంగజేబ్ ఉపయోగించిన వజ్రాల కత్తి చూశాం. జహంగీర్ వినియోగించిన ఖడ్గంనిండా కూడా వజ్ర వైడూర్యాలు క్రిక్కిరిసి ఉన్నాయి.

మరోచోట సిల్కు తివాసీలు చూశాం. 24 అడుగుల పొడవున్న ఒక తివాసీ బంగారు వన్నెతో మిలమిలలాడుతోంది. షాజహానుచక్రవర్తి ఎంతో ప్రేమతో దాచుకొన్న బొమ్మలు చూశాం. 17 వ శతాబ్దంలో దేశాన్ని పాలించిన చక్రవర్తుల చిత్రాలన్నీ చూశాం.

దక్షిణాదికి చెందిన రెండు కంచు విగ్రహాలు ఎంతో బావున్నాయి. నటరాజు, సోమస్కందుల విగ్రహాలు ఎంతో ముచ్చటగా ఉన్నాయి. ఇవిగాక, నృత్యం చేస్తున్న గణేశుడు, శివ పార్వతులు వున్నారు.

మరో పది గదుల్లో చైనా, జపాన్ దేశాలకు చెందిన శిల్ప సంపద, ఆ దేశాల ఔన్నత్యాన్ని చాటి చెప్పే లలిత కళల సంకేతాలు ఉన్నాయి.

ఇవిగాక, కళాఖండాలు, అసంఖ్యాకంగా ఉన్నాయి. పలువురు ఆధునిక చిత్రకారులు గీసిన బొమ్మలతోబాటు, ప్రాచీనచిత్రాలు కూడా యిక్కడ సముచిత స్థానాన్ని సంపాదించుకొన్నాయి.

ఇక్కడే ఒక ప్రక్కన పిల్లల విభాగం వుంది. చిన్న పిల్లలకోసం ప్రత్యేకంగా రూపొందించబడిన యీ విభాగంలో పసి హృదయాలను ఆకర్షించి, ఆనందాన్ని ఇచ్చే అంశాలు కోకొల్లలుగా ఉన్నాయి.

అక్కడే వున్న మరో గ్రంథాలయం పరిశోధకులకు బాగా ఉపయోగకారిగా ఉంటుంది.

'మ్యూజియంలో' తిరుగుతున్నంతసేపూ కాలం ఎలా గడిచిపోతుందో తెలియనే తెలియదు. ఇక్కడి గదులన్నీ చూడాలంటే ఐదారుగంటలు కనీసం కావాలి. అక్కడ గడిపే ప్రతి నిమిషానికీ, ప్రతిక్షణానికీ ఎంతో విలువ, అర్థమూ ఉన్నాయి.

రాజ్యాలు, వాటిని ఏలినరాజులు కాలగర్భంలో కలిసిపోయారు. ఆనాటి వైభవం యీనాడులేదు. కాని, చరిత్రకు కొన్ని సాక్ష్యాలున్నాయి. ఆ సాక్ష్యాల ఆధారంగా గతాన్ని అంచనా వేసికొన గలుగుతాం....అందులోనే ఆనందంవుంది ! ఆ ఆనందంలోనే ఎంతో అర్థమూ వుంది!! ●

ఉగాది
కానుక



శ్రీ దేవి ప్రొడక్షన్స్ వారి...

# పరమానందయ్య శిష్యులకథ

రచన సదాశివబ్రహ్మం, కూర్పు బి గోపాలరావు, ఛాయ సి నాగేశ్వరరావు, కళ వాలి
దర్శకత్వం సి.పుల్లయ్య సంగీతం ఘంటసాల నిర్మాత తోట సుబ్బారావు




S K.P.

వెండితెర నవల – ఒకరూపాయి ప్రాప్తిస్థానం: అబ్బూరి శరత్ బాబు, విజయవాడ–4



"ఆత్మగౌరవం"లో నాగేశ్వరరావు, కాంచన

చిత్రసమీక్ష:

# తెలుగు సొయగాలతో 'ఆత్మగౌరవం'

తొలినుంచీ మనసిచ్చి పుచ్చుకొన్న మేన కోడలు సావిత్రి శాశ్వతంగా తనునుంచి వెళ్ళిపోయింది ఆ స్థానాన్ని, అకస్మాత్తుగా సరళ కి వరళ సంపాదించుకొంటుంది తరువాత కొద్ది రోజులకే సరళ, సావిత్రి ఒకరేనని తెలిసికొన్న నాయకుడు శ్రీనివాసరావు ఆనందానికి అవధులుండవు ఎన్నడో పోగొట్టుకొన్నాననుకొన్న తన మనిషి, తన ప్రియురాలేకావటం —చివర కిది వివాహంగా పరిణమించటం— ఇలాతోగా అలా ఉన్నట్లురూ, కొంతకాలం గడిచి, మరి కొంత కాలం తెలియక— పబ్లిక్‌పార్కులు తమవిగా చేసికొంటారు.

ఈ మూల కథ చుట్టూ పొలిగోడులా కొలెడంత హాస్యాన్ని అల్లి, యీ గ్రంథాన్ని పండించటానికి సమర్థులయినవారిని ఎన్నుకోవటం, అలా ఎన్నికయిన వారి సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించుకోవటం మొదలయిన అంశాలు అన్నపూర్ణావారి "ఆత్మగౌరవం" చిత్రానికి ప్రాతిపదికలు. దీనికితోడు, యీ రంగంలో పాతవాడే అయిన కొత్త దర్శకుడు, ప్రతిభావంతుడయిన సంగీత దర్శకుడు, సాహిత్యాన్ని సమకూర్చిన యువతరమూ, చిన్ని అద్దాలకోనుంచి కొలెడంత — ప్రపంచాన్ని చూపించగల ఛాయాగ్రహణ దర్శకుడు, వీరిలో ప్రతి ఒక్కరి వెనుక నిలిచిన అనుభవజ్ఞులైన నిర్మాత కలిసి "ఆత్మగౌరవం" చిత్రంతో అన్నపూర్ణా సంస్థ ప్రమాణాలకు సరికొత్త 'వారధి'ని నిర్మించారు

ఇద్దరు ప్రియురాళ్లమధ్య నలిగిన నాయకుడు నాగేశ్వరరావు చిత్రంలోని ప్రబలమైన సంఘటనలకే నాయకుడయ్యారు. కాంచన, రాజశ్రీలు ఇద్దరు నాయికలుగా, తెలుగుదనం ప్రతిబింబించే రైతుబిడ్డ రామయ్యగా గుమ్మడి వెంకటేశ్వరరావు,— హాస్యాన్ని చిలికిస్తూ, ప్రేక్షకులమధ్య ఒలకబోసిన రేలంగి, రమణారెడ్డి, చలం, అల్లు రామలింగయ్య, సూర్యకాంతంగారలు ఇతర పాత్రలలో హేమలత, పుష్పకుమారి, ఛాయాదేవి, 'అతిథి'గా వాసంతి వారి వారి పాత్రలకు తమ ప్రతిభద్వారా మెరుగుల దిద్దినారు

దర్శకుడు విశ్వనాథ్ తొలి ప్రయత్నం ఆశించిన దానికంటే కొన్ని వందలరెట్లు ఘనంగావుంది. ప్రతిగీతిక చాటున రాజేశ్వరరావుగారు [illegible]. గొల్లపూడిమారుతిరావు, యద్దనపూడి సులోచనారాణిగారల కథకు, శ్రీ దుక్కిపాటివారి 'సినిమా అనుసరణ', తదనంతరం శ్రీయుతులు భమిడిపాటి, గొల్లపూడి మారుతీరావుగారల సంభాషణా రచన—అన్నీ మనోహరంగాఉన్నాయి.

బాక్సాఫీసు సూత్రావళిని వదే, వదే నెమరువేసికొంటూ, మరోవైపు న్యాయమైన తెలుగు సొయగాలను వలకరిస్తూ తయారయిన చిత్రం "ఆత్మ గౌరవం"

## "మన గీతికలు"

లలితశ్రీ పిక్చర్స్‌వారు యిటీవలనేతయారు చేసిన "మరపురాని గీతికలు" అనే డాక్యుమెంటరీ చిత్రాన్ని గత వారమే మద్రాసులో పత్రికలవారికి చూపారు

దాదాపు 15 నిమిషాలసేపు నడిచే యీ చిత్రంలో తరతరాలుగావస్తున్న తెలుగు వారి ప్రాముఖ్యతను గురించీ, తెలుగు దేశపు ఆచారాలను గురించీ చెపుతూ, ప్రజాదరణ పొందిన జానపద గేయాలను ఇంపుగా సొంపుగా వినిపించారు మొత్తం 13 [illegible] ఉన్నాయి.

పల్లెసీమలకు ప్రత్యేకంగా నిర్మాతలు వెళ్ళి, ఇందుకు సంబంధించిన దృశ్యాలను చిత్రీకరించారు. ఈ చిత్రం ద్వారా తెలుగు వాతావరణాన్ని ప్రతిఫలింపచేయాలనే కృషితో దర్శకుడు శ్రీ ఆర్ వి రమణమూర్తి కృతకృత్యులయ్యారు

ఇది తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ— మొత్తం మూడు భాషల్లో తయారయినట్లు ఆయన విలేఖరులకు తెలిపారు.

వాశిరాజు



తార మాలన్ (హిందీ 'మూగమనసులు'లో)



'పోతన'లో గుమ్మడి, రంగారావు

# సినిమా వార్తలు

## భక్తపోతన

భారత్ ఫిలింస్‌వారు 'భక్తపోతన' చాలా వరకు పూర్తి అయింది. ఈనెలలో పద్మినితో ఉన్న దృశ్యాలు, నాట్యాలు చిత్రీకరిస్తున్నారు. వచ్చే నెలలోనే యీ చిత్రం విడుదల చేయ తలచినట్లు యీ చిత్ర నిర్మాత శ్రీ టి విశ్వేశ్వరరావు తెలియజేశారు.

ఈ చిత్రంలో ఇద్దరు ఆంధ్ర మహా కవుల జీవిత చరిత్రలు చిత్రీకరించారు. భూదేవిని నమ్ముకున్న పోతన, మహారాజుల వాత్సల్యం పొంది భోగలాలసుడయిన శ్రీనాథుని జీవితాలు చిత్రీకరించారు.

పోతన, శ్రీనాథ పాత్రలు వరుసగా గుమ్మడి, యస్. వి. రంగారావు పోషిస్తున్నారు. ఇంకా యీ చిత్రంలో అంజలిదేవి, పద్మిని, నాగనాథ్, వాసంతి, లక్ష్మీకాంతం, శారద, బేబి రోహిణి, జయశ్రీ, చలం, బాలయ్య, ప్రభాకరరెడ్డి, గెస్టుగా శోభన్ బాబు, సావిత్రి గణేషన్ నటిస్తున్నారు. రచన శ్రీ సముద్రాల రాఘవాచార్య, సంగీతం యస్ రాజేశ్వరరావు. నిర్మాత—టి. విశ్వేశ్వరరావు, దర్శకత్వం—జి రామినీడు వహిస్తున్నారు.

## ఏప్రిల్ మొదటివారంలో 'భీమాంజనేయ యుద్ధం'

మహాలక్ష్మి మూవీస్ వారు పూర్తి చేస్తున్న 'భీమాంజనేయ యుద్ధం' చిత్రం



'ఆంధ్రమహావిష్ణుకథ'లో జమున

ఏప్రిల్ మొదటి వారంలో విడుదల చేస్తున్నారు.

ఈ చిత్రంలో భీముడుగా దండమూడి రాజగోపాల్, ఆంజనేయుడుగా కాంచనేని ఈశ్వరరావు నటిస్తున్నారు. ఇంకా కాంతా రావు, చలం, నాగభూషణం, సత్యనారాయణ, రాజశ్రీ, ఎస్. వరలక్ష్మి, విజయశ్రీ మొదలగు వారు నటిస్తున్నారు.

శ్రీ దోనేపూడి కృష్ణమూర్తి నిర్వాహణ వహిస్తున్న యీ చిత్రానికి సంగీత దర్శకత్వం: టి. వి. రాజు వహిస్తున్నారు. సంభాషణలు—ఆంధ్ర సుబ్రహ్మణ్యం వ్రాశారు. దర్శకత్వం—ఎస్. డి. లాల్ వహిస్తున్నారు.

## శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు కథ

శంభూ ఫిలిమ్స్‌వారి ద్వితీయ చిత్రం 'శ్రీకాకుళ ఆంధ్ర మహా విష్ణువు' త్వరలో విడుదల కాబోతుంది.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, ఎస్ వి రంగారావు, లింగమూర్తి, ప్రసాద్, జమున, సూర్యకళ, గిరిజ, సవితాదేవి, ఛాయాదేవి, రేలంగి, విజయలక్ష్మి, బాలయ్య మొదలగువారు నటిస్తున్నారు.

రచన—పింగళి నాగేంద్రరావు, సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు సమకూరుస్తున్నారు. నిర్మాత—దగ్గుపాటి లక్ష్మీనారాయణ చౌదరి. దర్శకత్వం—ఏ. కె శేఖర్.

## మంగళసూత్రం

అరుణాచల స్టూడియోస్, ప్రొడక్షన్స్ అధినేత శ్రీ ఏ. కె. వేలన్ రచయిత కూడా. అరుణాచల బేనర్‌తో తెలుగు చిత్రాన్ని ప్రారంభించారు. మొదట 'స్త్రీ' అని నామకరణం చేశారు. 'మంగళసూత్రం' అని మార్చినట్లు తెలుస్తుంది. ఈ చిత్రం దాదాపు పూర్తి అయినట్లే.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, దేవిక ప్రధాన పాత్రలు పోషిస్తున్నారు. ఇంకా యీ చిత్రంలో రమణమూర్తి, రమణారెడ్డి, పద్మనాభం, సీతారాం, వాసంతి, గీతాంజలి, హేమలత మొదలగు తారాగణం అంతా ఉన్నారు.

సంభాషణలు పినిసెట్టి శ్రీరామమూర్తి వ్రాశారు. సంగీతం—టి. చలపతిరావు. నిర్మాత, దర్శకుడు—ఏ. కె. వేలన్.

## 'అర్ధరాత్రి' ఔట్‌డోర్

హైదరాబాద్ మూవీస్ వారు తాము తాజాగా నిర్మిస్తున్న 'అర్ధరాత్రి' చిత్రం ఔట్‌డోర్ వెళ్లారు. మద్రాసు పరిసర ప్రాంతాలలో కథలోని దృశ్యాలకు సరిపోయే పుట్టూరు, కోవాలం మొదలగు స్థలాలు ఎన్నుకున్నారు. ప్రధాన నాయిక భారతితో ఒక పాటను యీ ప్రదేశాలలో చిత్రీకరించారు. ఆ పాటను ఆరుద్ర వ్రాశారు. ఈ చిత్రంలో నాయక పాత్రధారుడు శ్రీ జగ్గయ్య.

సంగీత దర్శకత్వం మాస్టర్ వేణు వహిస్తున్నారు దర్శకత్వం : పి. సాంబశివరావు నిర్మాత : పి. గంగాధరరావు.

ఈ చిత్రం అపరాధ పరిశోధకం కాదు. శీర్షికను చూసి చాలమంది డిటెక్టివ్ చిత్రం అని అభిప్రాయపడటం సహజం.

## 'శ్రీ కృష్ణతులాభారం' షూటింగ్ ప్రారంభం

సురేష్ ప్రొడక్షన్సువారు ఈ మధ్య 'శ్రీకృష్ణ తులాభారం' చిత్రం షూటింగ్ ప్రారంభించారు. విజయా అధినేత శ్రీ బి. నాగిరెడ్డి క్లాప్ కొట్టారు. ఈ చిత్ర నిర్మాత డి. రామానాయుడుగారి జ్యేష్ఠ పుత్రుడు చిరంజీవి సురేష్‌బాబు స్విచ్ ఆన్ చేశారు. ప్రారంభోత్సవం ఆడంబరం లేకుండా జరిగింది. ప్రారంభోత్సవానికి పరిశ్రమలోని ప్రముఖులు చాలమంది హాజరైనారు.

ఈ షూటింగ్ శ్రీకృష్ణ ఉద్యానవనంగా విజయ—వాహినీ స్టూడియోలో వేసిన సెట్టులో రెండు రోజులపాటు జరిగింది. ఈ షూటింగులో ఎన్. టి. రామారావు శ్రీ కృష్ణగా, పద్మనాభం వసంతకునిగా పాల్గొన్నారు.

ఇంకా యీ చిత్రంలో నారదునిగా కాంతారావు, ఇంద్రునిగా రాజనాల, నామదేవునిగా మిక్కిలినేని, సత్యభామగా జమున, శచిగా ఎస్. వరలక్ష్మి, రంభగా ఎల్. విజయలక్ష్మి, జయంతి, అనురాధలు శ్రీకృష్ణుని భార్యలుగా, వాణిశ్రీ నళినిగా, ఋష్యేంద్రమణి దేవకిగా, అతిథిగా నిర్మల, మాలతిగా మిక్కిపూడి రుక్మిణి చెలికత్తెగా నటిస్తారు. ప్రధాన పాత్ర రుక్మిణిగా అంజలీదేవి నటిస్తుంది.

రచన : సముద్రాల రాఘవాచార్య చేశారు. సంగీత దర్శకత్వం : పెండ్యాల నాగేశ్వరరావు, చిత్ర దర్శకత్వం : కమలాకర కామేశ్వరరావు వహిస్తున్నారు. నిర్మాత : డి. రామానాయుడు

## 'కన్నెమనసులు' రికార్డింగ్

'కన్నెమనసులు'కు పాటలు ఈమధ్య రికార్డింగ్ చేశారు.

ఈసారి 'కన్నెమనసులు' చిత్రాన్ని పాత, క్రొత్త తారల మేలి కలయికతో బాబూ మూవీస్‌వారు నిర్మిస్తున్నారు. శ్రీ ఆదుర్తి, బాబూ మూవీస్‌వారు చిత్ర నిర్మాణంలో చేస్తున్న నిహావమే అని చెప్పాలి.

ఈ చిత్రానికి కావలసిన కొన్ని పాటలు ఈమధ్య రికార్డింగ్ చేశారు.

—శర్మాజీ



విజయసారథీ ప్రొడక్షన్స్‌వారి "నిరపూజ" రికార్డింగ్ సందర్భంలో నటి కాంచన, గాయని సుశీల.

ఉంటారు పెద్దలంతా. రాధకి కూడ అభ్యంతరం ఏమీ లేకపోయింది.

రామనాథంగారు పోయేముందే వ్రాసిన విల్లు ప్రకారం ఇల్లు, రెండెకరాల పొలం ప్రకాశానికి, రెండెకరాలు రాధకి, మిగతా రెండెకరాలు కాంతమ్మగారికి చెందాయి.

రాధ రెండెకరాలు అమ్మేసి మూడు వేలు కట్నం యిచ్చి ఇంకో రెండు మూడు వేలు ఖర్చుపెట్టి ఉన్నంతలోనే బాగా చేశారు పెళ్ళి.

కాంతమ్మగారి పేర ఉన్న పొలం రాధకి ప్రకాశానికి చెరో ఎకరం యిస్తుందని ఆ మధ్యవర్తి పెళ్ళివారితో చెప్పిపెట్టాడు.

పెళ్ళయిన వెంటనే వాళ్ళు రాధని కాపరానికి తీసుకెళ్ళిపోయారు. అక్కడికి వెళ్ళింతరువాత భర్తని గురించిన వివరాలు ఒక్కొక్కటే తెలియరాసాగాయి రాధకి. అతను ఎన్నిసార్లు పరీక్షకి వెళ్ళినా బి. ఏ., ఒక్క పార్టు కూడా ప్యాసు కాలేదు. కాలేజీలో చదివే రోజులలో హాస్టల్లో ఉన్నప్పుడు అతనికి రకరకాల వ్యక్తులు స్నేహితులయ్యారు. అంతా కలిసి కాఫీ హోటలు, సినిమాలు, షికార్లు వీటితో కాలం గడపడంతో చదువులు అంతంత మాత్రంగానే ఉండేవి మిగతావాళ్ళ సంగతి ఎలా ఉన్నా భాస్కరం పరీక్ష మాత్రం పూర్తిగా మున్నా

## నిరీక్షణ

(15వ పేజీ తరువాయి)

చుట్టింది. తరువాత ప్రతిసారి పరీక్షకి వెడతానంటూ రెండేసి నెలలు బస్తీలో ఉండిపోవడం, బోలెడు డబ్బు తగ లెయ్యడం, ఇంతా చేస్తే ఆ పరీక్ష కాస్తా తప్పడం ఇలా జరుగుతూండేది.

చివరకి అతను ఆడపిల్లల సహవాసాలు కూడ చేస్తున్నాడని తెలిసి, భార్య వస్తే కుదురుగా ఉంటాడని నిశ్చయించుకుని అన్యాయంగా రాధ గొంతు కోశారు.

ఆ మధ్యవర్తికి కూడ చూచాయగా ఇవన్నీ తెలుసు. "ఆఁ ఏదో చిన్నతనంలో కాస్త సరదాగా తిరిగితే తప్పు ఏమిటి ?" అని సమర్థించుకుని చెప్పాడుకూడ. తరువాత ప్రకాశం నిలదీసి అడిగితే,

"ఇంక పరీక్షకి కట్టదలచుకోలేదు ఏదైనా ఉద్యోగ ప్రయత్నం చేస్తాను" అన్నాడు భాస్కరం హో రోజున.

"అబ్బాయి దారిలో పడుతున్నాడు. బాధ్యత తెలిసి వస్తోంది." అని మురిసి పోయారు తల్లీ, తండ్రీ.

"నేను పట్నం వెళ్ళి ఉద్యోగ ప్రయత్నము చెయ్యాలి. నీ దగ్గర డబ్బెంతుంది" అని అడిగాడు భార్యని.

అప్పటికి పెళ్ళయి పదిహేనురోజులే కావస్తున్నా భర్త అంటే ఎటువంటి అనురాగం, అభిమానం, అప్యాయిత కలుగలేదు రాధ కెందుకో. అతన్ని చూస్తుంటేనే ఏదో చెప్పలేని భయం ఆవహించి ఆమె సర్వాంగాలూ కంపించిపోతుండేవి.

"ఎంత కావాలి ?" అంది తలొంచుకునే.

"ఎంతుందో చెప్పమంటే ఏమిటా ఎదురు ప్రశ్నలు ? డబ్బేమీ ఇవ్వకుండానే పంపించిందేమిటి మీ అమ్మ ?" కటువుగా ఉంది భాస్కరం కంఠస్వరం.

నిజానికి రాధ దగ్గర అప్పుడు రెండు మూడు వందల రూపాయలదాకా ఉన్నాయి. పెళ్ళిలో వాళ్ళు వీళ్ళు యిచ్చినవి, బయలుదేరి వచ్చేటప్పుడు ఎందుకైనా ఉంటుందని తల్లి యిచ్చిన యాభై రూపాయలు కలిపి. మాట్లాడకుండా పెట్టె తీసి యాభై రూపాయలు భర్త చేతిలో పెట్టింది. అవి లెక్కపెటుకొని,

"ఈ ముష్టి యాభై రూపాయలు ఎన్నాళ్ళొస్తాయి ? అక్కడ హో నెల్లాళ్ళయినా ఉండి ప్రయత్నాలు చెయ్యకపోతే పని దొరకదు." అంటూ ఇంకా ఏదో గొణుక్కుంటూ గదిలోంచి వెళ్ళిపోయాడు భాస్కరం.

ఆ సాయంత్రమే ప్రయాణమై పట్నం వెళ్ళాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం రెండు నెలలదాకా తిరిగి రాలేదు. ఆ రెండు నెలలోనూ భార్య కొక ఉత్తరం అయినా

ం
...ురుచటి
...నే సంకో
...ప్లో పనిపాట
...ందులో అది
...న్నీ కొంచెం
...కి అలవాటులేక
వేయలేకపోతే రాధని
...ాజకురాలిగా పెంచిన
...పి దులిపేసేది. రాధ
...బగారు. శూలాలలాంటి
వింటూంటే పుట్టెడు
...ది రాధకి. అందులో
అతి గారాబంగా పెరిగి
ఎవరిచేతా ఒక్కమాటైనా పడి
అప్పటిదాకా. అలాంటిది ఎవరో
...వాళ్లు, వాళ్లకి తనని అంతంత
మాటలనే హక్కు ఏముందని ఎదురు
...ి ఆమె మనస్సు ఒక్కోసారి. కాని
...గానే అన్నీ సహించేది.

...క్కడ రాధా వాళ్లింట్లో నూతిలోవి
నీళ్లు. అందుచేత తాగడానికి, వంటకి,
...టికి రోజూ వో పది బిందెలయినా
...నుంచి మోసుకురావలసి వచ్చేది.
...వెళ్లక పూర్వం వాళ్ల తోటికోడలు
...ుండేది. ఇక రాధ వెళ్లాక ఆమెకి
...ావను వచ్చి ఆ డ్యూటీ రాధమీద
...ది. అందులో ఆ పెద్ద కోడలు
...ాంబగారి మేనకోడలు కావడంచేత,
...దట్లో తప్పనిసరి అయి ఈపనీ ఆపనీ
...సినా రాధ వచ్చాక పనంతా ఆమెమీదే
వదిలిపెట్టేసింది.

ఒకరోజున నీళ్లు తెస్తూ తెస్తూ వీధి గడపమీద బోర్లా పడిపోయింది రాధ. మోకాలు చెక్కుకుపోయి రక్తం వచ్చింది. బింది దొర్లుకుంటూ అంత దూరం వెళ్లింది. పెద్ద లొత్త కూడ పడింది. మోకాలు నెప్పితో రాధ బాధపడు...

...ంటే అయ్యో పాపం అని ఒక్కరూ అనలేదు. సరిగదా, "ఊఁ, కిందా మీదా నిలవడంలేదు. ఏం చూసుకునో ఆ విరగబాటు. కళ్లు నెత్తి నెట్టుకుని నడుస్తుంటే గుమ్మం తగల కేమవుతుంది ?" అంటూ ఒక్కొక్కళ్లు ఒక్కొక్కరకంగా వ్యాఖ్యానించారు.

ఓ రెండు నెలలు గడిచి తిరిగి వచ్చాడు. "చాలాచోట్ల అప్లికేషన్లు పెట్టాను. వో నెలరోజులలో తప్పకుండా ఉద్యోగం వస్తుంది" అంటూ చెప్పాడు వస్తూనే.

"ఒక్క ఉత్తరం కూడ వ్రాశారు కాదేం ?" అని అడిగింది రాధ భాస్కరం గదిలోకి రాగానే.

"సరేం. ప్రేమలేఖలు వ్రాసుకోడానికి కిదేం పట్నవాసం అనుకున్నావా ? లేకపోతే నువ్వేం అడివిలో ఉన్నావా నాకోసం బెంగపెట్టుకోడానికి. నాన్నగారి ఉత్తరాల ద్వారా సంగతులు తెలుస్తూనే ఉన్నాయిగా..

"అది సరేగాని, నీదగ్గ రింకేం డబ్బు లేదా ? నాన్నగా రిచ్చినది చాలలేదు. మళ్లీ అడగడానికి మొహమ్మాటం వేసి మా స్నేహితుడి దగ్గర రెండొందలు తీసుకున్నాను" అన్నాడు భార్య కళ్లల్లోకి చూస్తూ.

మొదట లేదని ఏభయ్యే యిచ్చి, అప్పుడుందంటే ఏమైనా అనుకుంటాడని భయపడి, "నాదగ్గ రింకేం లేదండి. ఉన్నదేదో మొన్ననే ఇచ్చానుగా" అంది తలొంచుకుని నెమ్మదిగా.

"ఆ. ఉద్ధరించావు" అంటూ కళ్లు మూసుకు పడుకున్నాడు.

రాధ మనస్సు నీళ్లు కారిపోయింది. "మామగా రిచ్చిన డబ్బు, నే నిచ్చిన డబ్బు కాకుండా, ఇంకా రెండు వందలు అప్పు చేసుకొచ్చారుట. వందలకి వందలు ఖర్చు పెట్టడానికి అదేం బొంబాయి, కలకత్తా లాంటి మహానగరం కాదే ! డబ్బు మంచినీళ్లప్రాయంగా తగలేస్తూ స్నేహితులతో గడుపుతూ ఇంట్లో భార్యని నిర్లక్ష్యం చేసే ఈవ్యక్తిలో మార్పు అనేది వస్తుందా?" అంటూ ఆమె హృదయం ఆక్రోశించింది.

(సశేషం)

**Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7Thambu chetty Street Madras-1. Phones : Editorial, 21747; Other depts : 29766. Chief Editor: S. Sambhu Prasad.**

ఎల్లప్పుడూ

# గోపాల్ పండ్లపొడినే

ఉపయోగించండి!




పంటినొప్పి, దంతక్షయం, నోటి దుర్వాసన, రక్తము పంటినుంచి కారుట, మొదలగు దంత వ్యాధులకు గుణమిచ్చునది, పళ్లను తెల్లగా మెరిసేలాచేసి, చిగుళ్లకు బలమిచ్చును.





టిన్నులలో కూడా అధికంగా అమ్ముడవుతూవున్నది.

తయారుచేయువారు: ఎస్.పి. జయం అండ్ కో,
25, కీళ్‌నాపాళై వీధి, మదురై-1

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA



తెల్లని దంతములకు ఆరోగ్యవంతమైన చిగుళ్ళకు

టూత్ పేస్ట్